Photo by S. N. Somani



బహుమతి
పొందిన వ్యాఖ్య

కొమ్మెక్కి కులికేవు

పంపినవారు :
ఎస్. శ్రీరాములు - మదనపల్లి

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు


గజరాజు ... 3
తాజెడ్డ కోతి ... 7
మకరదేవత (సీరియల్) ... 9
విచిత్రమైన కోరిక ... 17
గొప్పవాళ్ల మోసం ... 21
పేదపెళ్లికొడుకు ... 25
బుద్ధిమాలిన పులి ... 31
నావికుడు సింద్‌బాద్ 33
మిత్రభేదం (గే.క.)... 39
మనిషికన్న దొంగమేలు 42


ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫొటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.





ఆరోగ్యవంతులైన జనులు
ప్రతిరోజూ
లైఫ్‌బాయ్ సబ్బుతో
స్నానము చేయుదురు
– అది ప్రతిదిన * మలినములోని
క్రిములను కడిగివేయును!
* మనకు ప్రతిదినం
తార్చుపడే మామూలు
మురికిలో క్రిములున్నాయి.
మనలో ప్రతివారికీ యీ క్రిముల
వల్ల రోగాల ప్రమాదం వుంది.
అందుచేతనే చాలమంది ఆరో
గ్యవంతులగు జనులు
లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని
మరియు క్రిములను రోజూ
కడిగివేసుకొనుటవల్ల
తమ ఆరోగ్యమును
కాపాడుకొనుచు
న్నారు — అది
ఆరోగ్యవంతమైన
హాయిని
గలిగించును.
LIFEBUOY SOAP
LIFEBUOY SOAP



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనం సాధారణంగా మనుష్యులను గురించి కథలు
చదువుతాం, జంతువులను గురించి కూడా కథలు చదువుతాం.
కాని మనిషికీ జంతువులకూ గల సంబంధం తెలిపే కథలు
చాలా అరుదు. "గజరాజు" (జాతక కథ) అలాటిది. ఈ
కథలో ఒక అడవి ఏనుగుకు వడ్రంగులు ఏ విధంగా సహాయ
పడిందీ, వారికా ఏనుగు ఎలా ప్రత్యుపకారం చేసిందీ, దాని
కుమారుడు పట్టపు ఏనుగు అయి అపత్కాలంలో తన
యజమానినీ, రాజ్యాన్నీ ఎలాకాపాడిందీ చాలా చక్కగా
చిత్రించ బడింది.

"మనిషి కన్న దుంగ మేలు" అన్న కథలో కూడా ఎలుకా,
పామూ, చిలుకా గొప్ప ఔదార్యాన్ని ప్రదర్శిస్తాయి. ఈ కథలో
దుంగ కన్న కూడా హీనంగా ప్రవర్తించే వాడు రాజుమాత్రమే.

గొప్ప వారిలో ఉండే దుర్మార్గాన్ని బయట పెట్టే మరొక కథ
"గొప్పవాళ్ల మోసం" ఈ కథలో ఇద్దరు వైద్యులు స్వార్థం కొద్దీ
చేసే నీచమైన పనులు వివరించ బడ్డాయి. ఇందులో బిచ్చగాడు
మోసం చేసి బతికే వాడే అయినా, వైద్యులు చేసే వంచన వాడికి
కూడా ఏవగింపు కలిగిస్తుంది.

సంపుటి 19 సెప్టెంబరు 1956 సంచిక 3

CHITRA

# అట్టవిూది బొమ్మ

పాండవుల అరణ్యవాసం పన్నెండో ఏడు పూర్తి కాబోతూండగా, అర్జున పక్షపాతి అయిన ఇంద్రుడు ఒక ఆలోచనచేశాడు. త్వరలోనే పాండవ కౌరవుల మధ్య యుద్ధం జరగబోతుంది. ఆ యుద్ధంలో కౌరవులపక్క కర్ణుడుంటాడు. అతనికి సహజ కవచకుండలాలున్నాయి. వాటి ప్రభావం ఉన్నంతకాలమూ అర్జునుడు కర్ణుణ్ణి ఓడించలేడు. అందువల్ల ఇంద్రుడు బ్రాహ్మణవేషంలో కర్ణుడి దగ్గిరికి వెళ్ళి అతని సహజ కవచకుండలాలు యాచింతామనుకున్నాడు.

సూర్యుడు ఒకరాత్రి కలలో కర్ణుడికి ప్రత్యక్షమై, "నాయనా, ఇంద్రుడు బ్రాహ్మణరూపంలో వచ్చి నీ సహజ కవచకుండలాలు యాచిస్తాడు. నీవు వాటిని ఇవ్వకు. ఇచ్చినట్లయితే యుద్ధంలో నీకు చావు తప్పదు," అని హెచ్చరించాడు.

"దేవా, నా వ్రతం ఎలా తప్పేది? బ్రాహ్మణులు కోరితే ప్రాణమే ఇస్తానని ప్రతిజ్ఞ చేసిఉన్నాను," అన్నాడు కర్ణుడు.

"అలా అయితే ఒక పని చెయ్యి. నీవిచ్చే కవచకుండలాలకు బదులుగా ఇంద్రుడివద్ద ఉండే శక్తి తీసుకో," అని సూర్యుడు సలహా ఇచ్చాడు.

కొన్నిరోజుల అనంతరం ఇంద్రుడు బ్రాహ్మణవేషంలో కర్ణుడివద్దకు వచ్చాడు. కర్ణుడు, "బ్రాహ్మణోత్తమా, ఏమి కావాలో కోరుకో!" అన్నాడు. వెంటనే ఇంద్రుడు, "బాబూ, నీ సహజ కవచకుండలాలు కోసి నాకిచ్చెయ్యి! అంతకన్నా నాకింకేమీ అక్కర్లేదు!" అన్నాడు.

"స్వామీ, నీవు మాయవేషంలో వచ్చిన ఇంద్రుడివని నాకు తెలుసు. నీబోటివాళ్ళు మానవులకు వరాలివ్వాలిగాని, నాకు అపాయం కలిగించే వరం కోరటం న్యాయమా? నా కవచకుండలాలు అలాగే ఇస్తాను. కాని దానికి మారుగా నీ శక్తిని నాకియ్యి!" అన్నాడు కర్ణుడు.

"ఇస్తాను. కాని అది ఎల్లకాలం నీవద్ద ఉండదు. నీ శత్రువులలో ఒక్కణ్ణి చంపి అది మళ్ళీ నాదగ్గిరికి వచ్చేస్తుంది," అన్నాడు ఇంద్రుడు. కర్ణుడు నవ్వుతూ, "నాకున్న శత్రువు ఒక్క అర్జునుడే!" అన్నాడు. ఇంద్రుడు ఆలోచించి, "ఆ శక్తిని నువు ఆత్మరక్షణకు మాత్రమే ఉపయోగించాలి. లేకపోతే నిన్నే అది చంపేస్తుంది!" అన్నాడు.

కర్ణుడు ఈ నియమాలన్నిటికీ ఒప్పుకుని ఇంద్రుడికి తన కవచకుండలాలు ఒలిచి ఇచ్చేసి, ఆయనవద్ద శక్తి తీసుకున్నాడు.



# గజరాజు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో కాశీనగరానికి కొంత దూరంలో ఒక వడ్రంగుల గ్రామం ఉండేది. అందులో అయిదు వందలమంది వడ్రంగులుండే వారు. వారు చిన్న చిన్న పడవలలో బయలుదేరి ఒక అరణ్యానికి వెళ్లి, అక్కడ చెట్లు పడగొట్టి, కలప కోసి, పడవలలో తెచ్చుకుంటూ ఉండేవారు. ఆ కలప ఖర్చయిపోగానే మళ్లీ అందరూ కలిసి అరణ్యానికి వెళుతూ ఉండేవారు.

ఈ అరణ్యంలోనే ఒక మూల ఒక ఆడ ఏనుగు ఉంటూండేది. ఒకనాడు దాని కాలిలో పెద్ద పేడు దిగబడింది. దాని ఫలితంగా ఏనుగుకాలు వాచి సలుపుపెట్ట నారంభించింది. ఎంత ప్రయత్నించినా ఆ పేడును తీయటం దానికి సాధ్యంకాలేదు. ఇంతలో దానికి వడ్రంగులు చెట్లు కొట్టే చప్పుడూ, కలప కోసే చప్పుడూ విని పించింది. అది కుంటుతూ వారున్న చోటికి వెళ్లింది.

ఏనుగును చూడగానే దానికేదో బాధ కలిగిందని గ్రహించి, వడ్రంగులు తాము చేసే పని కట్టిపెట్టారు. ఏనుగు వారి ముందు పడుకున్నది. దాని కాలు వాచి ఉండటంవల్ల అందులో ఏదో గుచ్చు కున్నట్టు తెలుసుకుని, వడ్రంగులు తమ ఉలులతో ఉపాయంగా పేడును బయటికి లాగి, గాయానికి చికిత్సచేశారు.

త్వరలోనే ఏనుగు కాలు బాగయింది. అదిమొదలు ఆ ఏనుగు వడ్రంగులకు సాయపడసాగింది. అది పడిపోయిన చెట్లను తీసుకువచ్చేది, దుంగలను దొర్లించేది, కోసిన పలకలను నదిలో పడవలవద్దకు చేరవేసేది. ఆయేటి కాయేడు వడ్రంగు లకూ ఏనుగుకూ మధ్య స్నేహం పెరిగింది. అయిదు వందలమంది వడ్రంగులూ తమ



ఆహారంలో తలా కాస్తా తీసి ఏనుగుకు పెట్టేవాళ్ళు. అలా పెట్టిన ఆహారంతో ఏనుగుకు కడుపు నిండేది.

కాలక్రమాన ఈ ఆడఏనుగుకు ఒక పిల్ల కలిగింది. అది ఐరావతం జాతిది, తెల్లగా ఉండేది. ఆడఏనుగు ముసలిదైపోయాక, అది తన పిల్లను తెచ్చి వడ్రంగులకు వప్పగించి, తాను అరణ్యంలోకి వెళ్ళిపోయింది. ఇప్పుడీ తెల్ల ఏనుగు వడ్రంగులకు తోడ్పడుతూ, వారిచ్చే ఆహారాన్ని తింటూ, వారి పిల్లలను తన వీపు మీద ఎక్కించుకుని తిప్పుతూ, నదిలో స్నానం చేయిస్తూ ఉల్లాసంగా కాలం



వెళ్ళబుచ్చుతున్నది. వడ్రంగులు దానిని ఎంతో ప్రేమతో చూసుకుంటున్నారు.

అరణ్యంలో ఈ తెల్లఏనుగు ఉన్నదని తెలిసి, దాన్ని ఎలాగైనా పట్టుకుందామని బ్రహ్మదత్తుడు సపరివారంగా అరణ్యానికి వచ్చాడు. వడ్రంగులు రాజును చూసి, ఆయన కలపకోసం వచ్చాడనుకుని, "మహారాజా, శ్రమపడి తామే వచ్చారెందుకు? కలప కావలిస్తే మేము తెచ్చి ఇవ్వక పోయామా?" అన్నారు.

"నేను కలపకోసం రాలేదు. ఈ తెల్ల ఏనుగుకోసం వచ్చాను," అన్నాడు రాజు.

"అయితే తీసుకు వెళ్ళండి!" అన్నారు వడ్రంగులు వినయంగా.

కాని ఎంతకీ ఏనుగు కదలలేదు. రాజు వెంట వచ్చినవారిలో ఒకడు, "మహారాజా, ఇది వివేకంగల జంతువు. దానిని తమరు తీసుకుపోతే ఈ వడ్రంగులకు నష్టం కలుగుతుంది. వారికి తమరు పరిహారం ఇస్తేనేగాని అది కదలదు!" అన్నాడు.

రాజు ఏనుగు నాలుగు కాళ్ళదగ్గిరా, తొండందగ్గిరా, తోకదగ్గిరా ఒక్కొక్క లక్ష చొప్పున పెట్టి, వడ్రంగులను తీసుకోమన్నాడు. అప్పటికీ ఏనుగు కదలలేదు. వడ్రంగుల భార్యలకూ, పిల్లలకూ బట్టలు



పెట్టినాక అది కదిలి రాజువెంట నగరానికి వెళ్ళిపోయింది.

ఏనుగును మేళతాళాలతో నగరంలోకి తీసుకుపోయారు, వీధులన్నీ ఊరేగించారు. తరవాత దానిని ఒక ప్రత్యేకమైన శాలలో ఉంచారు. అది పట్టపు ఏనుగు అయింది. దానిమీద రాజుగారు తప్ప ఇంకెవరూ ఎక్కటానికి వీలులేదు.

ఈ ఏనుగు వచ్చాక కాశీరాజ్యం చాలా విస్తరించింది. దాని ప్రభావంవల్ల యెంత బలవంతులైన రాజులుకూడా కాశీరాజుకు ఓడిపోయారు.



కొంతకాలానికి రాజు భార్య గర్భవతి అయింది. ఆమె కడుపున బోధిసత్వుడు ప్రవేశించాడు. ఇంకొక వారానికి రాణీ ప్రసవిస్తుందనగా రాజు చనిపోయాడు. ఇదే సమయమనుకుని కోసలదేశపు రాజు తన సైన్యాలతో కాశీరాజ్యం పైకి దండెత్తి వచ్చాడు. ఏం చెయ్యాలో మంత్రులకు పాలుబోలేదు. వారు చాలాసేపు తమలో తాము చర్చించుకుని, చివరకు కోసల రాజుకు ఈవిధంగా కబురు పంపారు: "మా రాణీగారు ఒక వారంలోపల ప్రసవిస్తుంది. ఆమె ఆడపిల్లను కన్నట్టయితే మీరు వచ్చి కాశీరాజ్యాన్ని ఆక్రమించుకోండి. మగపిల్లవాడు కలిగినపక్షంలో మేము మీతో యుద్ధం చేస్తాం!" కోసల రాజు ఈ కబురు అందుకుని, వారం రోజులు గడువిచ్చాడు.

వారం గడవగానే మహారాణి బోధిసత్వుణ్ణి ప్రసవించింది. కాశీసేనలు కోసల సేనలతో యుద్ధానికి తలపడ్డాయి. కాని యుద్ధంలో కోసల సేనలదే పైచేయిగా కనిపించింది. అప్పుడు మంత్రులు మహారాణివద్దకు వెళ్లి, "అమ్మా, మన పట్టపు ఏనుగు యుద్ధరంగంలో ప్రవేశిస్తేనేగాని మనకు విజయం చేకూరదు. కాని మహారాజు మరణించినది మొదలు ఏనుగు



నిద్రాహారాలు మాని దుఃఖంలో మునిగి ఉన్నది. ఏమి చెయ్యాలో మాకు తోచటం లేదు," అని విన్నవించారు.

ఈ మాటలు వింటూనే మహారాణి పురిటిమంచంమీదినుంచి లేచింది. తన కుమారుడికి రాజోచితమైన దుస్తులు తొడిగింది. పిల్లవాణ్ణి తీసుకుని పట్టపు ఏనుగు వద్దకు వెళ్ళింది. ఆమె తన కుమారుణ్ణి ఏనుగుకాళ్ళముందు పెట్టి నమస్కారం చేసి, "గజరాజా, నీ యజమాని పోయి నందుకు విచారించవద్దు. ఇదుగో నీ యజమాని. వీడి శత్రువులు యుద్ధరంగంలో చెలరేగుతున్నారు. నీవు వెళ్ళి వారిని ఓడించు; లేదా, నీ కాళ్ళకింద ఈ కుర్రవాణ్ణి తొక్కి చంపెయ్యి," అన్నది.

అంతవరకూ విచారంగా ఉన్న ఏనుగు పిల్లవాడి శరీరాన్ని తన తొండంతో ప్రేమగా తడివింది, అతణ్ణి తొండంతో ఎత్తి తన శిరస్సుమీద పెట్టుకున్నది, తరవాత అతణ్ణి తల్లిచేతులలో పెట్టి వెంటనే యుద్ధరంగానికి కదిలిపోయింది.

ఏనుగు భీకరంగా ఘీంకరిస్తూ వాయువేగంతో తమ పైకి వచ్చి పడుతూండటం చూసి కోసల సైనికుల గుండెలు అవిసిపోయాయి. వారు చెల్లాచెదరుగా పారిపోసాగారు. ఏనుగు నేరుగా కోసలరాజుపద్దకు వెళ్ళింది, అతన్ని తొండంతో చుట్టి తీసుకువచ్చి రాజకుమారుడి పాదాలవద్ద పడవేసింది. కోసలరాజు పసివాడి కాళ్ళు అంటుకుని క్షమాపణ వేడుకున్నాడు. కాశీ మంత్రులు అతనికి ఎట్టి అపకారమూ చేయక, అతని దుశ్చర్యను క్షమించి తన దేశానికి తిరిగి పోనిచ్చారు.

బోధిసత్వుడు ఏడేళ్ళవాడయేదాకా ఏనుగు కాశీరాజ్యాన్ని కాపాడింది. తరవాత బోధిసత్వుడు సింహాసనానికి వచ్చి ఆ ఏనుగును తన పట్టపు ఏనుగు చేసుకుని, రాజ్యపాలనచేశాడు.





# తాబేద్దు కోతి...

పూర్వం ఒక గ్రామంలో ఒక గురువువద్ద అనేకమంది శిష్యులు ఉండేవారు. ఒక నాడు గురువుగారింటో వంటచెరుకు అయి పోయింది. అందుచేత శిష్యులందరూ ఎండు కట్టెలు ఏరుకురావటానికి దగ్గర్లో ఉన్న అడవికి వెళ్ళారు.

ఈ శిష్యులలో ఒకడు వట్టి సోమరిపోతు. వాడు తప్పనిసరి అయితేనేగాని పని చేసే వాడు కాడు. ఒకవేళ పని చెయ్యవలిసి వచ్చినా సాధ్యమైనంత తక్కువగానే చేసే వాడు. శిష్యులు చాలామంది ఉన్నారు గనక ఈ సోమరిపోతు ఎంత పని చేసినదీ ఎవరికీ తెలిసేదికాదు. దానికి తోడు వాడు తెలివైనవాడు గనక, తన సోమరితనం బయట పడకుండా ఎంతో జాగర్త పడుతూండేవాడు.

అడవిలో ప్రవేశించిన శిష్యులంతా ఎండు కట్టెలకోసం అంతటా వెతుకుతూ, పనికివచ్చే కట్టెలూ, పుల్లలూ ఏరి ఒక చోట పోగువేస్తూ పనిలో నిమగ్నులయారు. సోమరిపోతుకు ఇదంతా వృథా శ్రమ అని పించింది. వాడు మిగిలిన వాళ్ళకి ఎడంగా వెళ్ళాడు. ఎక్కడైనా ఎండిపోయిన చెట్టు కనిపిస్తుందేమోనని వాడి ఆశ. వాడు కొంతదూరం వెళ్ళాక వాడికి కావలిసిన చెట్టు దొరకనే దొరికింది. ఆ చెట్టున ఒక్క ఆకుకూడా లేదు. చెట్టు బెరడంతా నల్లగా ఉంది. అది ఎండు చెట్టే ననుకున్నాడు సోమరిపోతు.

"ఈ ఒక్క చెట్టు విరిచి పట్టుకుపోతే చాలు, ఎంతకాలమైనా పనికివస్తుంది!" అనుకుని సోమరిపోతు మంచి నీడ చూసు కుని నిద్రపోయాడు. వాడికి నిద్రపట్టే సమ యానికి మిగిలిన శిష్యుల మాటలూ, నవ్వులూ వినిపిస్తూనే ఉన్నాయి. కాని తీరా వాడు నిద్రలేచే సమయానికి చుట్టూ

ఆర్. ఇందుమతి

అంతా నిశ్శబ్దంగా ఉంది. పొద్దుకూడా చాలావరకు వాలిపోయింది.

సోమరిపోతుకు కంగారెత్తింది. తన తోటి శిష్యులు వంటచెరుకు మూటలు కట్టుకుని వెళ్లిపోయారని వాడు గ్రహించాడు. ఎదురుగా కనబడే మొండిచెట్టు కొమ్మలు గబగబా విరిచి, ఇంత మోపు కట్టి నెత్తిన పెట్టుకుని యింటికేసి పరిగెత్త సాగాడు. వాడు గురువుగారి ఇల్లు చేరేసరికి అప్పుడే మిగిలినవాళ్ళు ఇల్లు చేరటమూ, తమ కట్టెలన్నీ ఒక కుప్పగా వెయ్యటమూ కూడా అయింది. సోమరిపోతు రొజుకుంటూ వచ్చి, వాళ్ళు వేసిన కుప్పమీద తాను తెచ్చిన కట్టెల మోపు విప్పి పరిచాడు. అంతా సవ్యంగానే జరిగిపోయిందిగదా అని వాడు చాలా సంతోషించాడు.

ఆ రాత్రి గురువుగారు తన శిష్యులందరితో, "ఒరే, ఫలాని గ్రామంలో రేపు సంతర్పణ చేస్తున్నారు. మనకందరికీ పిలుపు వచ్చింది. నాకు వేరే పని ఉంది. కాని మీరంతా తెల్లవారక ముందే ఇంత అన్నం తిని బయలుదేరండి. మధ్యాన్నానికల్లా సంతర్పణకు అందుకుంటారు!" అన్నాడు. శిష్యులంతా సంతోషించారు.

తెల్లవారుజామునే గురువుగారి భార్య శిష్యులకోసం వంటచేద్దామనుకుని, కిందటి సాయంత్రం వాళ్ళు తెచ్చివేసిన కుప్పమీది నుంచి కట్టెలు తీసుకుపోయి, పొయి రాజేసింది. అయితే అవన్నీ పచ్చి కట్టెలు, సోమరిపోతు తెచ్చినవి. అందుచేత ఏ వేళకూ పొయి రాజలేదు. అన్నం ఉడికేసరికి సూర్యోదయంకూడా అయిపోయింది. శిష్యులు సకాలంలో అన్నం తిని ప్రయాణమై సంతర్పణకు వెళ్ళలేక పోయారు. తాజెడ్డ కోతి వనమెల్ల చెరిచిందన్నట్టు, ఒక్క సోమరిపోతు మూలంగా, శిష్యులందరికీ సంతర్పణ లేకుండాపోయి ఆశాభంగ మయింది.






## 15

[శివదత్తుడూ, మందరదేవుడూ, తాము చేరిన ద్వీపంలో ఒక విచిత్రవ్యక్తిని కనుగొన్నారు. వాడు, తను శమనద్వీపవాసిననీ, సముద్రకేతుడని పిలవబడే ఒక ఓడదొంగ పన్నెండేళ్ల క్రితం, తనను ఆ ద్వీపంలో వదిలిపోయాడనీ చెప్పాడు. ఆ తరవాత, అందరూ భోజనాల దగ్గిర కూర్చోబోయే సమయానికి, తీరంవెంట వికృతమైన కేకలు వినిపించినై. తరవాత—]

శివదత్తుడూ, మందర దేవుడూ, కత్తులు దూసి, పొదల చాటున నక్కుతూ, దాపులనే వున్న సముద్రతీరంకేసి బయలుదేరారు. వారి అనుచరులలో యిద్దరు మాత్రం వెనక వుండిపోయారు. వజ్రముష్టి చెట్లకిందినుంచి పాకుతూ, అందరికన్న ముందు సముద్రతీరం చేరి, వెనుక వస్తున్నవారికేసి 'జాగ్రత్త' అన్న సూచనగా చేయి వూపాడు.

అందరూ నిశ్శబ్దంగా చెట్ల సందునుంచి సముద్రంకేసి చూశారు. తీరంనుంచి ఒక వెయ్యి గజాల దూరంలో చిన్న నౌకా యుద్ధం జరుగుతోంది. ఆ యుద్ధంలో పాల్గొంటున్నవి మొత్తం ఆరు పడవలు. అసలే అల్లకల్లోలంగా వున్న సముద్రంలో అవి ఒకదాని నొకటి తాకుతున్నవి. ఆయుధాలు ధరించిన అనేకమంది యోధులు ఒక పడవమీంచి, మరో పడవ మీదికి దూకుతూ, తళతళలాడే కత్తులతో బాహాబాహి యుద్ధం చేస్తున్నారు.

ఉన్నట్టుండి హఠాత్తుగా, నల్లని వికృతాకారు డొకడు నోటితో కత్తి పట్టుకుని, ఒక




పడవ తెరచాపమీదికి సగంవరకూ పాకి, అక్కణ్ణించి కత్తిని కుడిచేత్తో ఝుళిపిస్తూ, 'జై కాలకేయా!' అంటూ అరిచి, మరో పడవమీదికి దూకాడు.

ఇక, ఆ క్షణంనుంచి పోరాటం మరీ భీకరంగా సాగింది. ఇరు పక్షాల యోధుల్లో కొందరు చేతులూ, తలలూ తెగి పడవలనించి దభీమని సముద్రంలో పడిపోతున్నారు. శిరస్త్రాణంలో ఒంటి కొమ్ము ధరించివున్న, ఆ నల్లని వికృతాకారుడు భీకరంగా అరుస్తూ, ఒక పడవమీంచి ఇంకో పడవమీదికి కత్తి గిరగిరా తిప్పుతూ కుప్పిగంతులు వేస్తున్నాడు.



"అయ్యో, వాడే సముద్రకేతుడు! క్రూరాతిక్రూరుడైన సముద్రపు దొంగ!" అన్నాడు వజ్రముష్టి, శివదత్తుడితో.

శివదత్తుడూ, మందరదేవుడూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. ఆ వికృతాకారుడు సముద్రకేతుడని తెలియగానే, ఇప్పుడు జరుగుతున్న యుద్ధం ఆ బందిపోటు ముఠాకూ, సముద్రం మీద పోతున్న మరేదో వర్తకుల పడవలకూ మధ్య అని శివదత్తుడు వూహించాడు. ఇప్పుడు ఏమి చేయటమా అని అతడు ఆలోచించేటంతలో, ఒక చిన్న తొట్టె పడవలాటిది తక్కిన పెద్ద పడవలనుంచి వేరై తీరంకేసి రాసాగింది.

శివదత్తుడూ, మందరదేవుడూ ఆశ్చర్యచకితులయ్యారు. ఆ చిన్నపడవ తీరంకేసి బయలుదేరటం, యుద్ధం చేస్తున్నవారెవరూ గుర్తించినట్టు లేదు. వాళ్ళు మామూలుగానే కేకలు పెడుతూ, పడవలమీదినుంచి దూకుతూ, ఒకరి నొకరు కత్తులతో నరుక్కుంటున్నారు.

కొద్దికాలం గడిచింది. హఠాత్తుగా సముద్రకేతుడు పెద్దకేక పెట్టి, "హేయ్! వాళ్ళు పారిపోతున్నారు. ఈదుకుపోయి ఆ పడవను పట్టుకోండి!" అంటూ అరిచాడు.





వెంటనే సముద్రపు దొంగల ముఠాలోని కొందరు సముద్రంలోకి దూకి, ఆ చిన్న తొట్టెపడవకేసి యీదసాగారు. వాళ్ళ వెంటనే మరి కొందరు దూకి, ఈదుకు పోతున్న ఆ దొంగలను వెనకనుంచి తమ కత్తులతో ఎదుర్కొన్నారు.

ఇప్పుడు, ఇరు పక్షాలవాళ్ళూ సముద్ర జలంలో ఈదుతూనే, ఒకరితో ఒకరు వీల యితే కత్తులతో, లేకపోతే ముష్టాముష్టి కలియబడి పోరాడసాగారు.

"ఈ యుద్ధం మరీ విచిత్రంగా ఉంది. ఒకవైపు నీటిలో ఈదుతూనే, మరో వైపు శత్రువును చంపజూడటం...యిలాంటి యుద్ధం నే నెక్కడా చూడలేదు!" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు అవునన్నట్టు తల వూపాడు. అతడి దృష్టి ఒకమారు పోరాటం జరుగు తున్న పడవలకేసి, మరోమారు తీరం సమీ పిస్తున్న తొట్టెపడవకేసీ ప్రసరిస్తున్నది. ఈ రెండింటికీ మధ్యగా సముద్రంలో ఈత గాళ్ల మధ్య భయంకర రణం సాగుతోంది.

క్రమంగా తొట్టెపడవ తీరాన్ని సమీ పించింది. ఇంకా ఒడ్డు ఐదారు గజాలు ఉందనగానే, అందులోంచి ఇద్దరు స్త్రీలు నీళ్ళల్లోకి దూకి, గబగబా ఒడ్డు చేరారు.




మరుక్షణంలో, సముద్రకేతుడి భీకరస్వరం సముద్రం మీద మార్మోగింది. వెంటనే రెండు పడవలు తీరంకేసి వేగంగా బయలు దేరినై. మునిగిపోతున్న రెండు పెద్ద పడవ లలోనుంచి కొందరు హృదయవిదారకంగా అరవసాగారు.

"మందరదేవా! ఇక మనం బయట పడక తప్పదు," అన్నాడు శివదత్తుడు. "ఆ పారిపోతున్న స్త్రీలు ఎవరన్నది ప్రస్తు తానికి అనవసరం. మనం, వెంటనే ఆ బందిపోటు సముద్రకేతుణ్ణి ఎదిరించకపోతే, వాళ్ళిద్దర్నీ అతడు సునాయాసంగా దొరక పుచ్చుకుంటాడు!"



మనం అందరంకలిసి ఎనిమిదిమందిమి మాత్రమే! సముద్రకేతుడి బందిపోటు ముఠా యాభై అరవైకి పైబడే ఉన్నట్టు కనబడుతోంది. మనం వాళ్ళను ఎదుర్కోవాలంటే, ఒక వుపాయం వుంది!" అన్నాడు.

'ఏమిటదీ!' అన్నట్టు మందరదేవుడు శివదత్తుడికేసి చూచాడు.

"మనం ఇంత స్వల్ప సంఖ్యలో ఉన్నట్టు సముద్రకేతుడు తెలుసుకోవటం మహా ప్రమాదం. అందుకని, మనం అయిదుగురం చెట్ల చాటునుంచి, ఒక్కసారిగా సహస్ర కంఠాలతో అరిచినట్టుగా, భీకరంగా అరుస్తూ, వాళ్ళమీదకు ఉరుకుదాం. ఇక మిగిలిన ముగ్గురూ, ఆ బందిపోటులను వెనుకనుంచి మనలాగే అరుస్తూ, ఎదుర్కొంటారు!" అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు వెనుదిరిగి చూచాడు. అతడికి ముగ్గురు సైనికులూ, వజ్రముష్టి మాత్రం కనిపించారు. "తక్కిన ఇద్దరూ ఎక్కడ?" అని ఒక సైనికుణ్ణి మందర దేవుడు ప్రశ్నించాడు.

"అయ్యా, వాళ్ళిద్దరూ భోజన సామగ్రి దగ్గిరే వుండిపోయారు!" అన్నాడు ఆ సైనికుడు వెనుదిరిగిచూస్తూ.

"వెంటనే వాళ్ళను ఇక్కడకు పిలుచుకురా!" అని మందరదేవుడు ఆ సైనికుణ్ణి ఆజ్ఞాపించాడు.

సైనికుడు వెనుదిరిగి బయలుదేరేంతలో శివదత్తుడు అతడిని ఆపి, "మందరదేవా,

మందరదేవుడు అంగీకరించాడు. భోజనాల దగ్గిర ఉన్న ఇరువురు సైనికులకూ ఈ సంగతి చెప్పి, వాళ్ళతోపాటు బందిపోటు ముఠాను వెనుకనుంచి ఎదుర్కోలసిందిగా ఆ సైనికుడు ఆజ్ఞాపించబడ్డాడు.

క్రమంగా, సముద్రకేతుడున్న పడవలు రెండూ తీరం చేరసాగినై. సముద్రంలో పోరాటం చల్లారింది. రెండు పడవలు మునిగిపోగా, మిగిలిన రెండు పడవలనూ,



సముద్రకేతుడి బందిపోట్లు వశపరుచుకుని, వాళ్ళ్ని తీరంకేసి బయలుదేరారు. వాళ్లకు దారిలో, నీట తేలుతూ పోరాడుతున్నవాళ్లు కనిపించగానే, తమవాళ్ళను పడవలలోకి లాగుతూ, శత్రువులను, పడవలమీద ఉండే; కత్తులతో తుదముట్టించసాగారు.

శివదత్తుడు ఆ భయంకర దృశ్యంకేసి ఓమారు చూచి, "మందరదేవా! ఆ బంది పోట్లు మొత్తంమీద అందరినీ హతమారు స్తున్నారు. ఇక, ఆ స్త్రీలను రక్షించే భారం మనం వహించవలసిందే!" అన్నాడు.

మందరదేవుడు సాలోచనగా తల వూపి, "ఇక మనం బయలుదేరుదాం!" అంటూ రెండడుగులు ముందుకు వేసి, పక్కనే వస్తున్న వజ్రముష్టికేసి చూచి, "అరెరే, వజ్రముష్టి నిరాయుధుడు! ఆ సంగతి ఇంత వరకూ మనం గమనించనేలేదు," అన్నాడు ఆశ్చర్యపోతూ.

ఆ మాటలకు వజ్రముష్టి నవ్వాడు. "అయ్యా, నాకు కావలిసిన కత్తిని నేనే సంపాయించుకోగలను. వీలైతే, ఆసముద్ర కేతుణ్ణి నా చేతులమీదుగా హతమార్చాలని ఆశగావుంది," అన్నాడు.

అందరూ అక్కడినుంచి బయలు దేరారు. వజ్రముష్టి ఆ ప్రాంతమంతా



బాగా ఎరిగివున్నవాడు గనక, ముందు దారి తీశాడు. ఒడ్డుకు చేరిన స్త్రీలిద్దరూ, ఒక సారి సముద్రంకేసి చూసి, తమను సముద్ర కేతుడు వెంబడిస్తున్నాడని గ్రహించి, భయ కంపితులై అక్కడ ఉన్న గుబురు చెట్ల లోకి పరిగెత్తారు.

ఇంతలో సముద్రకేతుడు ఉన్న పడ వలు రెండూ తీరం చేరినై. అతడు కత్తి పైకెత్తి, 'జై కాలకేయా!' అంటూ నీటి లోకి ఉరికి, వెనుదిరిగి తన అనుచరుల కేసి చూస్తూ, "ఆ స్వయంప్రభకు మాత్రం హాని కలగకూడదు! ఆ ముసలిదాన్ని కత్తికి ఎరచేయండి," అన్నాడు భీకరంగా.





సముద్రకేతుడు మోకాటి నీటిలో నడిచి, ఒడ్డు చేరాడు. అతడి వెనకనే, ఇరవైమంది సముద్రపు దొంగలు కూడా ఒడ్డెక్కారు. అందరూ ఆ స్త్రీలు పారిపోయిన గుబురు చెట్లకేసి, నిశ్శబ్దంగా బయలుదేరారు.

"మనం, ఆ ప్రదేశాన్ని ముందు చేరటం అవసరం. వాళ్లు చెట్లను సమీపించేంతలో, అందరం ఒక్కమారు అరుస్తూ, వాళ్ళ మీదకు దూకుదాం. విజయమో, వీర స్వర్గమో..." అన్నాడు శివదత్తుడు.

"అంతా మరాళదేవి కరుణ!" అంటూ మందరదేవుడు కత్తి పైకెత్తి, ఓమారు నమస్కరించాడు.

అందరూ ఆ చెట్ల గుంపులో జొరబడి, కత్తులు దూసి సిద్ధంగా ఉన్నారు. పారిపోయివచ్చిన స్త్రీల అలికిడి ఎక్కడా లేదు. "బహుశా వాళ్ళు, ఇంకా లోపలకు పారిపోయివుంటారు!" అన్నాడు మందరదేవుడు. శివదత్తుడు తలవూపి, "ఒకసారి, ఈ సముద్ర దొంగలను పారదోలితే, తరవాత వాళ్ళెక్కడ దాగివున్నదీ, తెలుసుకోవటం ఏమంత కష్టంకాదు," అన్నాడు.

సముద్రకేతుడు తన అనుచరులతో క్రమంగా చెట్లగుంపుకేసి రాసాగాడు. వజ్రముష్టి అక్కడ ఎత్తుగా పెరిగిన ఒక చెట్టు మీదికి పాకి, కిందకు వంగివున్న ఒక కొమ్మ





మీద పాములా పడుకున్నాడు. సముద్రకేతుడు అనుచరులతో ఆ చెట్టుకిందికి రాగానే, 'జై కాలకేయా!" అంటూ అతడు వారి మధ్యకు మెరుపులా దూకాడు. అదే సమయంలో 'జై మరాళీ!" అంటూ శివదత్తుడూ, మందరదేవుడూ, సైనికులతో చెట్లమాటునుంచి ఒక్కమారు బయటపడి, సముద్రకేతుడి మీదికి లంఘించారు.

కనురెప్పపాటు కాలం, సముద్రకేతుడు నివ్వెరపోయాడు. ఈలోపల వజ్రముష్టి, సముద్రపు దొంగలలో ఒకడినుంచి కత్తి గుంజుకుని, సింహంలా గర్జిస్తూ ఒకరిద్దరు శత్రువులను హతమార్చాడు.

అసరికి సముద్రకేతుడు తెప్పరిల్లాడు. అతడు తన అనుచరులను ప్రోత్సహిస్తూ, 'జై కాలకేయా!' అని అరిచి, శివదత్తుడి మీదికి దూకాడు. అప్పటికే అతడి అనుచరులు కొందరు వెన్ను చూపి సముద్రం కేసి పరిగెత్తసాగారు. ఇంతలో మరొక వైపునుంచి, ముగ్గురు సైనికులు భీకరంగా అరుస్తూ, దొంగలమీదికి దూకారు.

సముద్రకేతుడు బెదరలేదు. అతడు శివదత్తుడితో యుద్ధం చేస్తూనే కొంచెం కొంచెంగా వెనక్కు జరుగుతూ, "పారిపోకండి, నిలబడండి. శత్రువులు ఎనిమిది మందికన్న ఎక్కువ లేరు!" అని అరవ





సాగాడు. ఆ కేకలకు పారిపోతున్న అతడి అనుచరులు వెనుదిరిగి, ధైర్యం తెచ్చు కుని, తిరిగీ శివదత్తుడి సైనికుల మీద యుద్ధానికి తలబడ్డారు.

నాలుగైదు నిమిషాలసేపు పోరు ముమ్మ రంగా సాగింది. వజ్రముష్టిని నలుగురైదు గురు బందిపోట్లు చుట్టు ముట్టారు. కాని, అతడు అందరి కత్తిదెబ్బలనూ కాచు కుంటూ, తన చేతిలోని కత్తిని మెరుపులా తిప్పుతూ, వాళ్ళల్లో కొందరిని గాయపరి చాడు. గాయపడినవాడు ఒక్క చావుకేక పెట్టి వెనుకకు పడిపోగానే, ఆ స్థానాన్ని మరొకడు ఆక్రమించుకుంటున్నాడు.

పోరాటం, ఈ విధంగా మరెంతో కాలం సాగదని శివదత్తుడు గ్రహించాడు. అతడు, తనకన్న తక్కువ వయసువాడూ, మహా బలశాలీ అయిన సముద్రకేతుడితో యుద్ధం చేస్తూనే, ఒక కంట సముద్రతీరం చేరు తున్న శత్రువుల పడవలు రెంటినీ కని పెడుతూనే ఉన్నాడు. ఆ పడవలలోనుంచి మరికొందరు శత్రువులు ఒడ్డు చేరితే, ఆ తరవాత అందరూ కలిసి తననూ, అను చరుల్నీకూడా చుట్టుముట్టగలరు. ఈ పరి స్థితుల్లో తను అనుచరులతోపాటు వెను కకు తగ్గటమే మంచిదని అతడు నిర్ణ యించుకున్నాడు. ఈసరికి, తను రక్షించ దలచిన స్త్రీలిద్దరూ, అడవిలో చాలాదూరం పారిపోయివుంటారని అతడు భావించాడు.

శివదత్తుడు "జై, మరాళీ!" అంటూ ఒక్క కేక వేసి, సముద్రకేతుణ్ణి కుడి కాలుతో బలంగా తన్ని, అతడు వెనక్కు పడబోయి, తిరిగి కాలూదుకునేంతలో పెద్దగా తన అనుచరులను హెచ్చరించి, చెట్ల గుంపుకేసి పరిగెత్తాడు. అదే సూచ నగా, అతడి అనుచరులుకూడా వెనుకడుగు వేశారు. కళ్ళుమూసి తెరిచేంతలో, శివ దత్తుడూ, అతడి అనుచరులూ చెట్ల చాటుకు పారిపోయారు. (ఇంకా వుంది)



# విచిత్రమైన కోరిక

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు వెళ్లి శవాన్ని దింపి, భుజానవేసుకుని, మళ్లీ శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోవున్న బేతాళుడు, "రాజా, ఊసుపోకకు ఒక చిన్న కథ చెబుతా విను," అంటూ ఈ విధంగా చెప్పాడు :

పూర్వం కోసలదేశంలో ఒక కోయ కుటుంబం ఉండేది. కోయస్త్రీకి ఒక్క అన్నమాత్రమే వున్నాడు. ఆమె తలిదండ్రులు చనిపోయారు. అందుచేత కోయ తన బావమరిదినికూడా తనవద్దనే వుంచుకున్నాడు. పెద్దకోయా, అతని కుమారుడూ, బావమరిదీ కలిసి అడవి కొంత నరికి అందులో వ్యవసాయం చేసుకుంటూ ఉండేవారు. స్వయాన కష్టపడి సాగుకిందికి తెచ్చుకున్న భూమి కావటంచేతా, అడవిని ఆనుకుని ఉండటంచేతా ఆ పొలానికి శిస్తులూ,పన్నులూ ఉండేవికావు. పండించు

## బేతాళ కథలు



కున్న దంతా సుఖంగా అనుభవిస్తూ కోయ కుటుంబం కాలం వెళ్లబుచ్చుతున్నది.

ఇలా ఉండగా ఒకనాడు అడవిమార్గంగా ప్రయాణిస్తున్న ప్రయాణీకులను దొంగలు దోచారు. సొత్తు పోగొట్టుకున్నవారు కేకలు పెట్టేసరికి మరికొందరు ప్రయాణీకులు పరిగెత్తుకుంటూ వచ్చారు. ఇది చూసి దొంగలు అడవికి అడ్డంపడి ఎటో పారి పోయారు. వారిని తరుముకుంటూ వచ్చిన వారు మాత్రం కోయలు సాగుచేసుకునే పొలంవేపు వచ్చారు. అక్కడ వారికి పొలం దున్నుతూ కోయా, అతని బావమరిదీ, కొడుకూ కనిపించారు.

"వీళ్ళే దొంగలు! దొంగతనం చేసి ఇటుగా వచ్చి, ఏమీ ఎరగనట్టు పొలం దున్నుతున్నారు," అని దొంగలను తరుముకు వచ్చినవారు తమలో తాము అనుకున్నారు. తరవాత వారు ఆ ముగ్గురు కోయలనూ బలాత్కారంగా పట్టుకుని రాజధానికి తీసుకుపోయారు.

"వాళ్ల నేరంగురించి తరవాత విచారిస్తాం. ప్రస్తుతానికి వాళ్లను ఖైదులో ఉంచండి!" అని రాజు ఉత్తరువిచ్చాడు. కోయనూ, అతని బావమరిదినీ, కొడుకునూ ఖైదులో పెట్టారు.

తరవాత కోయల విచారణ జరిగింది. వారు నిర్దోషులనటానికి సాక్ష్యం ఏమీలేక పోయింది. తమను దోచిన దొంగలు ముగ్గురేననీ, వాళ్ళుకూడా కోయలేననీ సొత్తు పోగొట్టుకున్నవారు సాక్ష్యం చెప్పారు. అయినప్పటికీ పోయిన సొత్తు వారివద్ద దొరక లేదుగనక న్యాయాధికారి వారిని కొరత వేయించక జన్మఖైదు శిక్ష విధించాడు. ఎక్కడో అరణ్యం మధ్య వ్యవసాయం చేసుకుంటున్నవాళ్లు కావటంచేత ఆ కోయలను ఎరిగిన వాళ్ళుగాని, వారి పక్షాన మాట్లాడి సాయపడగలిగిన వాళ్ళుగాని ఒక్కరైనా లేకపోయారు.

ఈ సంగతి కోయ భార్యకు తెలిసింది. ఆమె వెంటనే బయలుదేరి రాజధాని చేరి, రాజగృహంవద్దకు వెళ్లి, "బాబూ, రక్షించండి! కాపాడండి!" అని ఎలుగెత్తి కేకలు పెట్టసాగింది.

ఆ అరిచే మనిషి ఎవరో, ఎందుకు అరుస్తున్నదో కనుక్కురమ్మని రాజు తన భటులను పంపాడు. వారు వచ్చి కోయ భార్యను, "ఎందుకు గొంతు చించుకుని అరుస్తున్నావు?" అని అడిగారు.

"అయ్యా, రాజుగారు కొంచెమైనా ముందూ వెనకా ఆలోచించకుండా, ఏ పాపమూ ఎరగని నావాళ్లను తెచ్చి ఖైదులో ఉంచారు. ఒక్క ఆడదాన్ని, నాగతి ఏం కావాలి?" అని అడిగింది.

భటులు తిరిగివచ్చి రాజుతో కోయ భార్య అన్న మాటలు చెప్పారు. అది విని రాజు, "ఆమనిషికి కొంత ధనం ఇచ్చి, అక్కడి నుంచి పంపివేయండి," అన్నాడు.

భటులు కొంత ధనం తీసుకుపోయి కోయ భార్యకు ఇవ్వబోయారు. కాని ఆమె ఆ ధనాన్ని తీసుకోలేదు. భటులు వెళ్లి ఈసంగతి చెప్పేసరికి, రాజు ఆమెను పిలిపించాడు. కోయ భార్య వచ్చి రాజు గారికి నమస్కారంచేసి నిలబడింది.



"డబ్బు తీసుకోమంటే వద్దన్నావుట. నీకేం కావాలి?" అని రాజు ఆమె నడిగాడు.

"మహారాజా, ఒక్కసారిగా నాకున్న భర్తనూ, కొడుకునూ, అన్ననూకూడా పట్టుకుని ఖైదులో పెట్టి, నన్ను ఒంటరిదాన్ని చేశారు. ఇంటో మగదిక్కు లేదు!" అన్నది కోయభార్య దీనంగా.

రాజు ఉదారుడు. "ముగ్గురినీ వదలాలంటే సాధ్యంకాదు. వారిలో ఎవరినైనా ఒకరిని కోరుకో. ఈక్షణమే వదిలేస్తాను," అన్నాడాయన.

"అయితే నా అన్నను వదిలెయ్యండి!" అన్నది కోయభార్య.

ఈమాట విని రాజు చాలా ముచ్చట పడ్డాడు. భటులను పిలిచి కోయనూ, కొడుకునూ, బావమరిదినీ కూడా వదల వలిసిందిగా ఆజ్ఞాపించాడు.

బేతాళుడు ఈవిధంగా కథ ముగించి, "రాజా, నాకొక సందేహం. కోయభార్య తన భర్తను విడిపించమనీ కోరక, కొడుకును విడిపించమనీ కోరక, అన్నను విడిపించ మని ఎందుకు కోరింది? భర్తమీదా, కొడుకు మీదా ప్రేమలేకనా? ఆ ఇద్దరిలో ఏ ఒకరి పైనా పక్షపాతం చూపలేకనా? అది అలా వుండగా; ఒక్కరినే వదిలేస్తానన్న రాజు ముగ్గురినీ ఎందుకు వదిలేశాడు? కాపు భార్య కోరిన కోరిక రాజుకెందుకు సంతోషం కలిగించింది? తాను ఇస్తానన్నదే చాలు నని పెద్దగా కొరక, తక్కువగానే కోరిం దనా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

"కోయభార్య తన అన్నను వదిలెయ్య మని కోరటానికి కారణాలు నువు చెప్పినవి కావు. ఒక భర్తపోతే మరొక భర్తను చేసు కోవటం కోయలలో ఆచారం. అందుచేత ఆమెకు ఈ భర్తపోతే ఇంకో భర్త వస్తాడు. అలాగే ఈ కొడుకు పోతే ఇంకో కొడుకు వస్తాడు. కాని, ఆమె తల్లిదండ్రులు అది వరకే చనిపోయారుగనక, ఈ అన్నపోతే మరి అన్న రాడు. అందుచేత అమె అన్నను విడిపించమని కోరింది. అది గ్రహించి రాజు సంతోషించాడు. ఎక్కువైన కోరిక తీర్చి తక్కువైన కోరికలు నిరాకరించటం దాత యొక్క లక్షణం కాదు గనక, రాజు కోయ భార్యకు అన్నతోబాటు భర్తనూ, కుమారుణ్ణి కూడా ఇచ్చేశాడు," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

ఈ విధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)



# గొప్పవాళ్ల మోసం




పూర్వం రోమ్ నగరంలో ఒక ధర్మకర్త ఉండేవాడు. ఆయనకు అనాథలను చూస్తే అపరిమితమైన జాలి. అటువంటి వారిని చేరదీసి, వారికి కలిగిన బాధలు తొలగించి, ఎంతగానో సహాయపడేవాడు.

అ నగరంలోనే ఒక బిచ్చగాడుండేవాడు. వాడు రకరకాల వేషాలు వేసి ప్రజలు చేసే దానాలతో పొట్టపోసుకుంటూ ఉండేవాడు. ఫలానా ధర్మకర్తగారు గొప్ప దాత అనీ, ధర్మాత్ముడనీ వాడికి తెలిసింది. ఆయనదగ్గిర పెద్ద దానం పుచ్చుకోవాలని బిచ్చగాడికి కోరిక కలిగింది. వాడు తన కాలికి ఏవో పసర్లు రాచుకుని లావుగా వాచేటట్టుగా, కాలికి పెద్ద వ్రణం వచ్చినట్టుగా చేసుకున్నాడు. ఇటువంటి విద్యలలో వాడు నేర్పరి కావటంచేత సామాన్యులెవరూ మోసం కనిపెట్టలేరు. ఈ కాలుతో బిచ్చగాడు బాధపడుతున్నట్టు మూలుగుతూ ఒకనాటి ఉదయం ధర్మకర్తగారి భవంతి బయట కూచున్నాడు. ధర్మకర్తగారి ఇంటికి వచ్చే పోయే జనం వాణ్ణి చూసి జాలిపడి చిల్లరడబ్బులు వేయసాగారు. కాని వాడికి కావలిసింది ధర్మకర్తగారి దానం. అందుచేత వాడు ఆ స్థలం విడిచిపెట్టి పోలేదు.

కొంతసేపటికి ధర్మకర్తగారే బయటికి వచ్చాడు. ఆయనను చూడగానే బిచ్చగాడు, "కరుణించండి, బాబూ! బాధతో చచ్చిపోతున్నాను, నాయనా!" అని ఎలుగెత్తి ఏడవసాగాడు.

వాడి కాలు చూడగానే ధర్మకర్తకు గుండె కరిగిపోయింది. ఆయన తన భటులను పిలిచి, "పాపం, వీణ్ణి తీసుకుపోయి పడుకోబెట్టండి—నా పక్కమీదనే పడుకోబెట్టండి. నేను గట్టి వైద్యులను పిలిపిస్తాను. వాడికి కావలిసిన ఉపచారాలు

కె. సూర్యారావు

ఏ లోటూ రాకుండా చెయ్యండి," అని హెచ్చరించి వెళ్ళిపోయాడు. ధర్మకర్తగారి భటులు బిచ్చగాణ్ణి తీసుకుపోయి ధర్మకర్తగారు స్వయంగా పడుకునే హంసతూలికా తల్పంమీద పడుకోబెట్టారు. మరి కొద్ది సేపట్లో ఇద్దరు వైద్యులు బిచ్చగాడి కాలు పరీక్షించటానికీ, అవసరమైన చికిత్స చెయ్యటానికీ వచ్చారు. వాళ్ళు రోమ్‌నగరానికంతటికీ పేరుమోసిన వ్రణవైద్యులు.

పండుకోసం పోతే చెట్టు విరిగి మీద పడ్డట్టయింది బిచ్చగాడికి. ధర్మకర్తగారు పెద్దగా ధర్మంచేసి పంపిస్తారనుకుంటే వాడి ప్రాణానికి వైద్యులు దాపరించారు.

ఆ వైద్యులలో ఒకడు బిచ్చగాడి కాలు చూస్తూనే, "అబ్బో, చాలా ముదిరిపోయింది. కాలు తెగగొట్టాలిసిందే!" అన్నాడు. బిచ్చగాడికి గుండె ఆగినంత పని అయింది.

రెండో వైద్యుడు బిచ్చగాడి కాలును శ్రద్ధగా పరీక్షించాడు. "ఇది దొంగవాపు. ఈ బిచ్చగాళ్ళు కొన్ని పసరులు పూసి ఇటువంటి రోగాలు సృష్టించగలరు. కొంత సేపటికి ఆ వాపు అదే పోతుంది. మందులూ మాకులూ అవసరంలేదు," అన్నాడాయన.

మొదటి వైద్యుడు కూడా బిచ్చగాడి కాలు పరీక్షించిన మీదట రోగం నిజం



కాదని తెలిసిపోయింది. వైద్యులిద్దరికీ కోపం వచ్చింది. "చికిత్స చేస్తే ధర్మకర్తగారు బోలెడంత డబ్బిచ్చేవాడు! దొంగ వెధవ, మన నోట కరక్కాయ కొట్టాడు! వీడి సంగతి ఆయనకు చెప్పేద్దాం!" అన్నా డొక వైద్యుడు. "అంతకంటె వీడికి నిజంగా రోగమేనని చెప్పి, కాలు నరికేద్దాం! అట్లాగాని వీడికి తగిన శాస్తి జరగదు!" అన్నాడు రెండో వైద్యుడు.

బిచ్చగాడికి ప్రాణభయం పట్టుకుంది. వాడు పక్కమీద లేచి కూచుని, "బుద్ధి గడ్డి తిని, నాలుగు డబ్బుల కాశపడి, తప్పుడు పని చేసిన మాట నిజమేనయ్యా! నన్ను రక్షించండి! నా కాలు తెగగొట్టకండి అందువల్ల మీకేం లాభం?" అని కాళ్ళా వేళ్ళాపడి బతిమాలసాగాడు.

వైద్యులిద్దరూ కూడబలుక్కున్నారు. "ఇప్పుడు మాత్రం మించిపోయినదేమిటి? వాడి కాలు నయంచేసినట్టు నటించి, మన డబ్బు మనం పుచ్చుకుందాం," అని వారు నిశ్చయించుకున్నారు. వాళ్లు బిచ్చగాడితో, "ఒరే, నువు నోరు మెదిపావంటే, జాగ్రత్త! మేము చెప్పేదాకా ధర్మకర్తగారితో నీ కాలు నయంకాలేదనే చెప్పు. లేకపోతే ఆ కాలు నీకు దక్కదు, బాగా గుర్తుంచుకో!" అని భయపెట్టారు.





బిచ్చగాడు కడుపు కక్కుర్తి కోసం జనాన్ని మోసగించేవాడే అయినప్పటికీ, వాడికి ఈ పేరు మోసిన వైద్యుల మోసం చూసి ఆశ్చర్యం కలిగింది. కాని వారికి ఉండే ధైర్యం తనకు లేనందున, వాడు ఆ వైద్యులు చెప్పిన ప్రకారమే చేశాడు.

వైద్యులు ధర్మకర్తతో, "స్వామీ, ఈ దౌర్భాగ్యుడు చాలా అపాయస్థితిలో ఉన్నాడు. భగవదనుగ్రహంవల్ల వాడు మీ కళ్ళపడ్డాడు, మీరు మమ్మల్ని పిలిపించారు. వాడి కాలు నయంచేయటానికి మా శక్తి కొద్దీ ప్రయత్నిస్తాం, ఆపైన భగవంతుడున్నాడు!" అని చెప్పారు.

వాళ్ళు రోజూ వచ్చి కాలు కట్టు విప్పి, మళ్ళీ కట్టిపోతున్నారు. వారాలూ, నెలలూ గడుస్తున్నాయి. ఎంతకీ కాలు నయం కాదు, చికిత్స పూర్తికాదు. బిచ్చగాడికి అన్నివిధాలా సుఖంగానే జరిగిపోతున్నది, కాని ఇంతకంటె స్వేచ్ఛగా వీధులవెంబడి అడుక్కుతిన్న రోజులే వాడికి మంచివని పించాయి. వాడు వైద్యులను, "నా కాలు త్వరగా నయం చెయ్యండి. మీకు పుణ్యం ఉంటుంది!" అని ప్రార్థించసాగాడు.

మూడు నెలలు దొంగవైద్యం చేసినమీదట, బిచ్చగాడి బాధ భరించలేక, వైద్యులు చికిత్స పూర్తిఅయిందని ధర్మకర్తకు తెలియ జేశారు. ఆయన చాలా సంతోషించి వైద్యులకు గొప్పగా బహుమానాలూ, డబ్బూ ఇచ్చాడు.

తరవాత ధర్మకర్త బిచ్చగాడితో, "ఏమిరా, నీ కాలు నయమయిందిగదా, ఏం పని చేస్తావు? ఎట్లా జీవిస్తావు?" అన్నాడు.

"బుద్ధి వచ్చింది, బాబూ! ఇక జన్మలో బిచ్చమెత్తను! అదితప్ప ఇంకే పనిఅయినా చేసుకుంటాను!" అన్నాడు బిచ్చగాడు.

వాడా మాట ఎందుకన్నాడో ధర్మకర్తకు అర్థంకాలేదుగాని, ఆయన వాడికి తనవద్దనే ఉద్యోగం ఇచ్చి దగ్గిర ఉంచుకున్నాడు.





# పేదపెళ్లి కొడుకు

పూర్వం ఒక దూరదేశంలో ఒక చిన్న రాజుండేవాడు. ఆయన అంతగా కలవాడు కాడు. ఆయనకు గుణమణి అని ఒక అంద మైన కుమార్తె ఉండేది. తన స్థితిలో తానై ఆమెకు గొప్ప సంబంధం తీసుకురాలేక, ఆయన ఆమెకు స్వయంవరం జరప నిశ్చ యించాడు. స్వయంవరం ప్రకటించినప్పుడు కన్యను పెళ్ళాడ గోరినవారంతా వచ్చి, ఆమెకు తమ తమ తాహతులనుబట్టి బహు మానాలిస్తారు. అలా వచ్చినవారిలో తనకు నచ్చినవాణ్ణి కన్య వివాహమాడుతుంది.

గుణమణిని పెళ్ళాడటానికి వచ్చిన రాజ కుమారులందరిలోకీ ఆర్భాటంగా వచ్చిన వాడు భద్రుడనేవాడు. అతని తండ్రి పేరు దుర్జయుడు. ఆయన చాలా భయంకరుడు, క్రూరుడు. కేవలం దుర్మార్గంతో ఆయన చాలామంది రాజులకు అశాంతి కలిగిం చాడు. దుర్జయుడి బాధ పడలేక ఒకప్పుడు పదిమంది రాజులు ఒక చోట సమావేశమై అతనిపైన దండెత్తటానికి నిశ్చయించారు. వారు సమావేశంనుంచి వెళ్ళిపోతూండగా దుర్జయుడు దారి కాచి వారిలో అయిదు గురిని బందీలుగా పట్టుకుని. ఎంతో ధనం వారివద్దనుంచి తీసుకుని వదిలేశాడు.

గుణమణి స్వయంవరానికి భద్రుడు వచ్చి రాజద్వారం చేరిన సమయానే వీరు డనే మరొకడుకూడా చేరాడు. ఇతను ఒక ముసలి గుర్రాన్ని ఎక్కి, సొట్టలు పడి మాట్లువేసిన కవచం ధరించి అతి పేదగా ఉన్నాడు. దుర్జయుడికి చిక్కి తమకు గల ధనమంతా ధారపోసి ప్రాణాలతో బయటపడిన అయిదుగురు రాజులలో వీరుడి తండ్రికూడా ఒకడు. అందుచేతనే వీరుడింత పేదగా ఉండటం జరిగింది.

భద్రుడు వీరుడికేసీ, అతని ముసలి గుర్రంకేసీ నిరసనగా చూసి, అతన్ని తోసు

ఎస్. అనంతరామయ్య



శిస్తున్నాడు. అన్ని రకాల పోటీలలోనూ అతనిదే పైచేయిగా ఉంది. కాని వీరుడు తక్కువ తిన్నవాడు కాడు. ద్వంద్వయుద్ధాలలో భద్రుడు ఓడించినవారికన్న ఎక్కువ మందినే వీరుడు ఓడించాడు. అయితే భద్రుడికీ వీరుడికీ ద్వంద్వ యుద్ధం జరిగినప్పుడు మాత్రం వీరుడు ఓడిపోయాడు. ఇందులో ఆశ్చర్యం లేదు. భద్రుడి వెంట చాలా గుర్రాలున్నాయి. ఒక్కొక్కరితోనూ యుద్ధం చెయ్యటానికి అతను ఒక్కొక్క గుర్రం ఎక్కాడు. వీరుడి గుర్రం అనేక యుద్ధాలు చేసి అలిసిపోయి ఉన్నది. అందుచేత వీరుడు భద్రుడిమీద ఓడాడు.

కుంటూ తన గుర్రాన్ని రాజద్వారంకుండా ముందుకు అదిలించాడు. వీరుడు అతన్ని ముందు వెళ్లనిచ్చి, "రాజులు వచ్చేటప్పుడు నౌకర్లే ముందు నడుస్తారు," అన్నాడు. భద్రుడికి మండిపోయింది. అవకాశం చూసి తన ప్రతాపం చూపుదామనుకున్నాడు.

స్వయంవరంలో మొదటిది రాజకుమారుల బలపరాక్రమ ప్రదర్శనం. ఒక మైదానంలో ఈ ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. ప్రదర్శనాన్ని చూడటానికి రాజకుటుంబం వారితోబాటు గుణమణికూడా వచ్చింది. రాజకుమారులందరిలోకీ భద్రుడు చుక్కల్లో చంద్రుడల్లే ప్రకా

సూర్యాస్తమయం కాగానే అతిథులందరూ దర్బారు భవనంలో సమావేశమైనారు. ఒక్కొక్కరే గుణమణివద్దకు వచ్చి తాము తెచ్చిన కట్నాలు ఆమెకు సమర్పించారు. ఎంతో విలువైన కట్నాలు తెచ్చిన రాజకుమారులెందరో ఉన్నారు. అయినా భద్రుడు తెచ్చిన కట్నాలముందు ఇవేవీ రాణించలేదు. అందరికన్నా ఆఖరుకు వచ్చినవాడు వీరుడు. అతను తన కత్తిని తీసి గుణమణి ముందు పెట్టి, "నేను పేదవాణ్ణి. నాకున్న అమూల్యమైన వస్తువు ఇదొకటే!" అన్నాడు.



"దాని గొప్పమాత్రం ఏముంది? ఇంతకు ముందు అది నిన్ను ఓడనివ్వలేదా?" అని భద్రుడు ఎత్తిపొడిచాడు.

"మనిద్దరి మధ్యా సమయుద్ధం జరిగి ఉంటే ఈ కత్తి మహిమ చవిచూసి ఉండే వాడివే!" అన్నాడు వీరుడు.

మర్నాటి కార్యక్రమం అరణ్యంలో వేటాడటం. అతిథులందరూ తమ తమ గుర్రాలెక్కి వేటకు బయలుదేరారు. వీరుడు కూడా అడివికి వెళ్ళాడుగాని అతను వేటాడి తన గుర్రాన్ని శ్రమపెట్ట దలచలేదు. అందరికన్న చొరవగా వెళ్ళిన భద్రుడు మొదలైనవారి వెంట గుణమణికూడా గుర్ర మెక్కి వెళ్ళింది. కాని కొంతదూరం పోయాక ఆమెకు వేటమీద ఉత్సాహం తగ్గి పోయి వెనక్కు తిరిగి రాసాగింది. వీరుడు ఆమెకు ఆ సమయంలో ఎదురుపడ్డాడు.

"మీకు వేటమీద ఆసక్తి లేదా?" అని గుణమణి వీరుణ్ణి అడిగింది.

"ఉన్నది. కాని నా గుర్రం ముసలిదై పోయింది. ఎంతోకాలంగా మా వంశానికి సేవ చేసింది. దాన్ని శ్రమపెట్టటం ఇష్టం లేదు," అన్నాడు వీరుడు.

"మంచి గుర్రం లేని కారణంచేత మీరు అన్నింటా వెనకపడుతున్నట్టున్నారు. నా గుర్రం తీసుకుని, మీ గుర్రం నాకిచ్చె య్యండి," అన్నది గుణమణి.

"ఈ గుర్రం నాకు ప్రియమైనది. ఇది ఎంతో కాలంగా మాకు సేవ చేసింది. దీనిని ఎవరికీ ఇవ్వను," అన్నాడు వీరుడు.

"నిన్న మీరు నాకు కత్తి ఇస్తూ అదే మీకు అమూల్యమైనదన్నారు. ఆ మాట అబద్ధమేనన్న మాట!" అంటూ గుణమణి తన గుర్రాన్ని అదిలించి, వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

అక్కడితో స్వయంవరం కార్యక్రమం ముగిసింది. గుణమణి తన నిర్ణయాన్ని మరొక నెలకు ప్రకటిస్తుంది. అతిథులు

బయలుదేరి వెళ్ళిపోసాగారు. వీరుడికి తప్ప మిగతా అందరికీ గుణమణి వీడ్కోలు చెప్పింది. వీరుడికేసి ఆమె చూడనైనాలేదు. ఇందు కతను చాలా చింతించాడు అతను రాచనగరు దాటి కొంతదూరం వచ్చేసరికి ఒక గొర్రెలకాపరి కుర్రవాడు కనిపించాడు.

వీరుడు ఆ కుర్రవాణ్ణి పిలిచి, "నువ్విప్పుడు చూసే విషయం మీ రాజకుమార్తెకు తెలియజెయ్యి," అంటూ గుర్రం దిగి, తన కత్తి తీసి దానితో గుర్రాన్ని చంపి, "గుణమణికోసం నిన్ను బలి చేశాను!" అని చచ్చిన గుర్రంతో అని తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన వారం రోజులకు వీరుడి ఇంటి బయట ఒక మేలుజాతి గుర్రం కట్టివేసి ఉంది. దాని మెడలో ఒక బిళ్ళపైన "ప్రత్యేకమైన తేడాలు సరిచేయవచ్చు" అని రాసివుంది. ఆ గుర్రం గుణమణి పంపినదేనని ఊహించి వీరుడు సంతోషించాడు.

నెల గడిచిపోయింది. గుణమణి స్వయంవరంలో పాల్గొన్న రాజకుమారులంతా ఆమె నిర్ణయం తెలుసుకోవటానికి మరొకమారు వచ్చారు. ఆమె శతవిధాల భద్రుడినే పెళ్ళాడుతుందని అందరూ అనుకున్నారు. కాని ఆమె వీరుణ్ణి తన భర్తగా స్వీకరిస్తున్నానని అందరి యెదటా పలికింది.



అందరూ ఆశ్చర్యపోయారు, భద్రుడు మాత్రం మండిపోయాడు.

"ఈ వీరుడి ప్రజ్ఞ నేనింతవరకు చూడ లేదు. వివాహం జరగక ముందు, నేనో అతనో ద్వంద్వ యుద్ధంలో తేల్చదలుచు కున్నాను," అన్నాడు భద్రుడు.

"ఈ పూట వేటకు పోదాం. వేటనుంచి తిరిగి వచ్చాక మీలో ఎవరితోనైనా సరే నేను యుద్ధానికి సిద్ధమే," అన్నాడు వీరుడు.

అతిథులందరూ అరణ్యానికి వెళ్ళి, పగ లల్లా వేటాడారు. సాయంకాలానికల్లా అందరూ తాము అడవిలో కొట్టిన జంతు వులతోసహా తిరిగివచ్చారు. భద్రుడూ, వీరుడూ మాత్రం తిరిగిరాలేదు. వాళ్ళిద్దరూ అరణ్యంలో ఏమి అఘాయిత్యానికి దిగారో నని గుణమణి భయపడింది. కాని భద్రుడు బోలెడన్ని జంతువులను చంపి చీకటి పడే సమయానికి వాటితోసహా తిరిగివచ్చాడు. వీరుడి జాడలేదు. అతనికోసం చాలాసేపు వేచివుండి మిగిలినవారు భోజనాలకు లేచారు. ఆ సమయానికి వీరుడు తిరిగి వచ్చాడు. అతని వాలకం చూస్తే ఒక్క మృగాన్నికూడా కొట్టినట్టు కనబడలేదు.

"ఇంత ఆలస్యం చేస్తే ఎంత గొప్పవేట చేసి వస్తావో అనుకుంటున్నాం. ఏవీ నీవు కొట్టిన జంతువులు?" అన్నాడు భద్రుడు.



"నేను ఎక్కువ జంతువులను వేటాడ లేదు. అయినా వేట దొరకటం, దొరకక పోవటం కేవలం దైవాధీనం. అది అందరూ ఎరిగిన విషయమే!" అన్నాడు వీరుడు.

"నువు కొట్టినదేదో బయటపెట్టరాదా? ఎందు కిన్ని కబుర్లు?" అన్నాడు భద్రుడు.

"ఇదుగో!" అంటూ వీరుడు తన పైబట్ట చాటునుండి ఒక మనిషి తల తీసి భద్రుడి కాళ్లముందు పడేశాడు. అది భద్రుడి తండ్రి అయిన దుర్జయుడి తల.

కొంతసేపు ఎవరి నోటా మాట లేదు. అందరూ దిగ్భ్రాంతులైపోయారు. కాని తరవాత వారి మనసులు ఆనందంతో నిండిపోయాయి ఈ దుర్జయుడు ఎందరినో హీనస్థితికి తెచ్చాడు; అందరికీ పక్కలో బల్లెంగానే ఉన్నాడు. అటువంటి దుర్మార్గుణ్ణి ఇంతకాలానికి ఈ వీరుడు తుదముట్టిం చాడు. అందుచేత అతనిపై అందరికీ గొప్ప గౌరవం ఏర్పడింది.

భద్రుడికిమటుకు చేతులూ కాళ్ళూ చల్లబడ్డాయి. తన తండ్రి బలం అండ చూసుకునే అతను దర్పంగా తిరిగాడు. అటువంటి శూరుణ్ణి చంపిన వీరుడంటే భద్రుడికి చెప్పరాని భయం కలిగింది. అందుచేత అతను వీరుణ్ణి ద్వంద్వ యుద్ధా నికి పిలవనేలేదు. కనీసం తన తండ్రిని చంపినందుకు పగ తీర్చుకుందామని అయినా ప్రయత్నించలేదు. అందుచేత భద్రుడిపై అందరికీ గౌరవం పోయింది.

తరవాత గుణమణికీ వీరుడికీ వివాహ మయింది. గుణమణి స్వయంవరానికి వచ్చిన రాజులందరూ పెళ్లికి వుండి పోయారు. తరవాత భద్రుడు తన తండ్రి కోటను విడిచి, కొద్దిపాటి బలగంతో ఎటో పారిపోయాడు. ఆ కోట వీరుడి వశ మయింది. అతను చుట్టుపక్కల రాజులతో స్నేహ సంబంధాలు ఏర్పరుచుకుని తన భార్యతో సుఖంగా రాజ్యంచేశాడు.



# బుద్ధిమాలిన పులి

ఒక తండ్రీ, కొడుకూ అడవిలో ప్రయాణం చేస్తూంటే చీకటిపడింది. ఆ రాత్రికి వారు ఒక కోనేటి పక్కన ఉండే ఎత్తయిన గట్టుమీద పడుకున్నారు. అసలే అడవి, అందులో చీకటి. అటువంటిచోట పడుకోవటమంటే కుర్రవాడికి చాలా భయంవేసింది. అందుచేతవాడు తండ్రి డొక్కలో తల దూర్చి పడుకున్నాడు.

వాళ్ళు గాఢనిద్రలో ఉండగా ఒక పులి అటుగా వచ్చింది. నాలుగు చేతులూ, నాలుగు కాళ్ళూ, తల ఒకటి మాత్రమే గల జంతువు నిద్రపోతున్నట్టు దానికి తోచింది. ఈ వింతనుగురించి తన స్నేహితుడైన మొసలి నడుగుదామనుకుని పులి కోనేటి అంచుకు దిగి వెళ్లింది.



అంతా విని మొసలి, "నువు సరిగా చూసి వుండవు. రెండో తల ఎక్కడో వుంటుంది. వెతికి పట్టుకో. నీ కందినదాన్ని నువు తిను, నీటిలో పడ్డదాన్ని నేను తింటాను!" అన్నది.

పులి గట్టుమీదికి వచ్చి తండ్రి తల వాసన చూడసాగింది. దాని మీసాలు ముక్కుకు తగలటంవల్ల తండ్రి ఫెడీమని తుమ్మాడు. ఆ అదురుకు పులి కాస్తా కోనేట్లో పడింది. మొసలి తెలియక దాన్ని తినేసింది!



# ఎవరు పెద్ద?

హిమాలయపర్వత ప్రాంతంలో ఒక పురాతనమైన మర్రి చెట్టుండేది. దానిమీద ఒక చకోర పక్షి, ఒక కోతీ ఉండేవి. చెట్టుకింద ఒక ఏనుగు నివసిస్తూ ఉండేది. మూడూ ఒక చోటనే ఉంటూకూడా ఎప్పుడూ తమలోతాము కీచులాడుకుంటూండేవి.

ఇలా కీచులాడటం వాటికే భావ్యంగా కనిపించలేదు. అందుచేత అవి, తమలో ఎవరు వయసులో పెద్ద అయినదీ తేల్చుకుని, వారు చెప్పిన ప్రకారం మిగిలిన ఇద్దరూ వినేటందుకు నిశ్చయించాయి. కాని వయసులో ఎవరికన్న ఎవరు పెద్దో తేల్చుకునే దెలా?

"నాకు ఊహ వచ్చేనాటికి నేను ఈ మర్రి చెట్టుమీద నిలబడితే దీని తల సరిగా నా పొట్టకు తగులుతూండేది," అన్నది ఏనుగు.

"ఈ చెట్టు ఇంకా చిన్నదిగా ఉండగా నే నెరుగుదును. నేను నేలమీద కూచుని, నోటితో ఈ చెట్టుపై చిగుళ్లు అందుకునేదాన్ని," అన్నది కోతి.

"తమ్ముళ్ళారా, ఇక చెప్పకండి. ఇక్కడికి కొంతదూరంలో మరొక పెద్ద మర్రిచెట్టు ఉండేది. నేను దాని పండు తిని ఇక్కడ రెట్టవెయ్యగా ఈ మర్రి మొలిచింది," అన్నది చకోరపక్షి.

ఆనాటినుంచీ చకోరపక్షి చెప్పినట్టు ఏనుగూ, కోతి వినసాగాయి. వాటిలో వాటికి పోరు లేకుండా పోయింది.



# నావికుడు సింద్‌బాద్

నేను సాటిలేని భోగాలలో మునిగి తేలుతున్నప్పటికీ, కొంతకాలానికి నాకు ప్రపంచపు మారుమూలలూ, కొత్త కొత్త దీవులూ చూడాలన్న కోరిక కలగసాగింది. వర్తకంమీదకూడా ఆసక్తి కలిగింది. నేను బజారుకు వెళ్లి వర్తకానికి పనికివచ్చే సామగ్రి కొని, మూటలు కట్టించి రేవుకు పట్టించుకువెళ్ళాను. త్వరలోనే ఒక ముచ్చటైన నౌక రేవులోకి వచ్చింది. సముద్రప్రయాణానికి కావలిసిన హంగులన్నీ ఆ నౌకలో అమరి ఉన్నాయి. దాని తెరచాపలుకూడా ఎంతో అందంగా ఉన్నాయి. ఈ నౌకను చూడగానే నాకు చాలా ముచ్చటవేసి నా సరుకంతా అందులోకి ఎక్కించాను. ఆ నౌకలోనే నే నెరిగిన వర్తక స్నేహితులు కొందరు ప్రయాణం చేస్తున్నారు. వారితో కలిసి ప్రయాణం చేయటం నాకు సంతోషం కలిగించింది.

ఆ రోజే నౌక లంగరు ఎత్తి కదిలింది. అది సముద్రంమీద చాలా వేగంగా సాగింది. మేము అనేక వారాలపాటు సముద్రయానం చేసి అనేక దీవులలో ఆగాం. అక్కడి అధికారుల పరిచయం చేసుకున్నాం. అక్కడి వర్తకులకు మా సరుకులు అమ్మాం,

రెండవ సముద్రయానం

CHITRA



వీలయితే వారి సరుకులతో మారకం వేసుకున్నాం. చివరకు మా నౌక ఒక దీవిని తాకింది. ఆ దీవి సౌందర్యం వర్ణనాతీతం. ఎక్కడ చూసినా ఎత్తయిన చెట్లున్నాయి, వాటిమీద రకరకాల పక్షులు మనోహరంగా కూస్తున్నాయి. సెలయేళ్లు ప్రవహిస్తున్నాయి. కాని ఆ దీవిలో మనిషి అన్నవాడు ఎక్కడా కనబడలేదు.

మేమంతా ఈ దీవిమీద కొంతసేపు విశ్రాంతి తీసుకుంటామంటే సరంగు సమ్మతించి లంగరు వేయించాడు. అందరూ దిగి చెట్ల మధ్యగా పచార్లు చేయసాగారు. నేను కొద్ది అహారం తీసుకుని ఒక సెల



యేటి ఒడ్డున పచ్చని చెట్లనీడల కిందికి వెళ్ళాను. అలాటి చోట కూచుని భోజనం చెయ్యటమే ఒక విందు అనిపించింది. చల్లగా మలయమారుతం వీస్తున్నది. పచ్చని గడ్డిమీద విశ్రమించి కునుకుతీశాను.

నేను నిద్ర లేచేసరికి దీవిలో ఒక్కరూ లేరు. రేవులో నౌక లేదు. నా సంగతి మరిచిపోయి నౌక మిగిలినవారిని ఎక్కించుకుని కదిలిపోయి వుంటుంది. సముద్రం వేపు పరకాయించి చూస్తే చాలా దూరాన తెరచాపలు కనిపించాయి. నౌక అప్పుడే కనుచూపు మేర దాటి పోతున్నది.

నాకు కలిగిన దిగ్భ్రమా, దైన్యమూ అంతా ఇంతా కాదు. నాకున్న సమస్తమూ ఆ నౌకలో వెళ్ళిపోతూంటే, ఈ నిర్జనమైన దీవిమీద ఒంటరిగా దిగబడిపోయిన నాగతి ఏం కాను? నాకు మతిపోయినట్టయింది. "ఒరే సింద్‌బాద్ నావికుడా! నీ కొంప కూలిపోయింది. మొదటి ప్రయాణంలో నిన్ను కాపాడిన విధి మళ్లీ కాపాడుతుందా? చెయిజారిన కూజా మొదటిసారి పగలక పోతే రెండోసారైనా పగిలితీరుతుంది!" అని గట్టిగా కేక పెట్టాను.

నేను ఏడిచాను. లోపలినుంచి తన్నుకొచ్చే నిస్పృహను వదిలించుకోవటానికి





నెత్తి బాదుకుని కేకలు పెట్టాను. "ఒరే దౌర్భాగ్యుడా! బాగ్దాదులో సుఖంగా కుడిచి కూచోలేకనేనా, తగుదునమ్మా అని మళ్ళీ సముద్రయానం తలపెట్టావు? రాజభోగంగా ఏ లోటూ లేకుండా నీకు జరిగిపోతూ ఉండెనే. నీకు ఏ లోపం జరిగిందని బయలుదేరావు? నీ మొదటి సముద్ర యానం సుఖంగా సాగింది గనకనా?... ఏమనుకుని ఏం లాభం? పుట్టినవాడికి చావు తప్పదు," అనుకుంటూ వెర్రివాడి లాగా అయిపోయి పడిపోయాను.

క్రమంగా నా బుద్ధి వాస్తవాన్ని గుర్తించ సాగింది. గతించినదానికి ఏడిచి ప్రయో జనంలేదు, కర్తవ్యం ఆలోచించాలి. నేను లేచి నిలబడి కొంతసేపు అయోమయంగా నడిచాను. అలా నడవటం క్షేమం కాదనీ, ఏ క్రూరజంతువైనా ఎదురుకావచ్చుననీ తోచి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కాను. ఆ చెట్టుమీదినుంచి చుట్టూ కలయచూశాను. అన్నివైపులా చెట్లూ, పక్షులూ, కొండలూ, గుట్టలూ తప్ప ఏమీ కనిపించలేదు; కాని ఒక దిక్కుగామాత్రం ఏదో తెల్లగా, పెద్ద దిగా కనిపించింది. అదేమిటో తెలుసు కుందామని చెట్టు దిగి, ఆ దిక్కుగా నడవ సాగాను. కాని లోపల భయం పీకుతూం డటంవల్ల కాలు చురుకుగా సాగలేదు. చిట్టచివరకు ఆ తెల్లని వస్తువు ఒక బ్రహ్మాండ మైన బురుజులాగా వున్నట్టు స్పష్టమయింది. లోపలికి పోవటానికి మార్గం యేదైనా ఉందేమో చూతామని దాని చుట్టూ ప్రద క్షిణం చేశాను. కాని ఎక్కడా మార్గం లేదు. పోనీ దాని పైకి ఎక్కుదామంటే అది నున్నగా గచ్చుచేసినట్టుగా ఉండటం చేత కాలికి పట్టు చిక్కలేదు. అది యెంత ప్రమాణం వుందో చూతామని చుట్టూ అంగలు వేసుకుంటూ తిరిగి యిసకలో పడిన నా కాలి గుర్తులు లెక్కించగా సరిగా నూటయాభై అంగలున్నాయి.



ఈ చిత్రమైన కట్టడంలోకి యెలా ప్రవేశించగలనా అని ఆలోచిస్తున్నంతలో అకస్మికంగా సూర్యుడు కాస్తా మాయమై చీకటి పడ్డట్టయింది. మొట్టమొదట, సూర్యుడికి మబ్బేమైనా అడ్డువచ్చిందా అనుకున్నాను, కాని వేసవికాలంలో మబ్బులెందుకుంటాయని వెంటనే అనిపించింది. సూర్యుడికి అడ్డువచ్చిన దేమిటా అని చూసేసరికి సూర్యుడికి అడ్డంగా ఎగురుతూ ఒక బ్రహ్మాండమైన పక్షి కనబడింది. దాని రెక్కల బారు ఊహించలేనంతగా వుంది.

మొదట నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. కాని తరవాత నేను అదివరకు వినివున్న గండభేరుండ పక్షులు జ్ఞాపకం వచ్చాయి. ఈ పక్షులు యెక్కడో సముద్ర మధ్యన ఒక దీవిలో ఉన్నాయనీ, అవి ఏనుగులను సయితం సునాయాసంగా ఎగరవేసుకుపోతాయనీ నా చిన్నతనంలో అనేక మంది యాత్రికులూ, నావికులూ చెప్పారు. ఆ వచ్చే పక్షి గండభేరుండ పక్షి కావచ్చునసీ, ఇసకలో వున్న ఈ బురుజులాటిది దాని గుడ్డు కావచ్చుననీ నాకు తోచింది. ఈ నా ఊహ సరిఅయినదని రుజువయింది. ఆ పక్షి నేరుగా వచ్చి ఆ గుడ్డుమీదనే వాలి, తన రెక్కలు రెండువైపులా చాచి నిద్రపో సాగింది.

ఆ పక్షి గుడ్డుమీద వాలే సమయానికి నేను ఇసకలో బోర్లా పడుకున్నాను. తర వాత నేను లేచేసరికి పక్షి కాలు ఒక పెద్ద చెట్టు మానుకన్నకూడా పెద్దదిగా కనిపించింది. నేను వెంటనే నా తలపాగా తీసి విప్పి, దాన్ని జములుగా పెనవేసి మోకు లాగా తయారుచేసి, దాని సహాయంతో నన్ను నేను ఆ పక్షి కాళ్ళల్లో ఒకదానికి గట్టిగా కట్టేసు కున్నాను. నా ఉద్దేశ మేమంటే, ఎప్పుడో ఒకప్పుడు ఈ పక్షి లేచి పోకపోదు. దాని వెంబడి నేనుకూడా వెళ్ళితే, నన్ను అది ఎక్కడైనా మనుషు ఖుండే చోట దించుతుందేమోనని.

ఈ నిర్జన ద్వీపంకన్న ఏ చోటైనా నయమే ననిపించింది. నేను దాని కాలికి కట్టుకుంటున్న సంగతి ఆ పక్షికి కొంచెమైనా తెలియ వచ్చినట్టు లేదు. నేను దాని ప్రాణానికి ఏ ఈగో, దోమో అన్నట్టుగా వుండివుండాలి.

తెల్లవార్లూ నేను అదే స్థితిలో వున్నాను. నేను నిద్రపోతూండగా అది ఎగిరిపోతుందేమోనని, తెల్లవార్లూ మేలుకునే వున్నాను. కాని పూర్తిగా తెల్లవారినాకనే అది గుడ్డు మీదినుంచి లేచి, ఒక భయంకరమైన కేక పెట్టి, గాలిలోకి లేచింది. అది ఆకాశంలోకి ఎంత యెత్తు ఎగిరిందో చెప్పలేను. అలా చాలా యెత్తు లేచి అతివేగంగా దిగి



రాసాగింది. ఆ పక్షి దిగే వేగానికి నా బరువే నాకు తెలియకుండాపోయింది. చివరకా పక్షి ఒక రాతిమీద వాలింది. నేను వెంటనే నా నడుముచుట్టూ కట్టుకునివున్న తల గుడ్డ విప్పసాగాను. నేను దాని కాలినుంచి విడిపడే లోపుగా మళ్ళీ అది ఎగిరిపోతుం దేమోనని నా భయం. నేను కట్టు విడి పించుకుని ఇవతలికి వచ్చి, ఆ పక్షి కళ్ళ పడకుండా యెక్కడ దాక్కుందామా అని చూస్తుండగా ఆ పక్షి మళ్లీ లేచింది. దాని గోళ్ళ మధ్య ఒక నల్లని అసాధారణమైన ప్రమాణంగల పాము చిక్కివుండటం నాకు కనిపించింది. నేను చూస్తూండగానే ఆ గండభేరుండపక్షి పాముతో సహా పైకిలేచి, వేగంగా వెళ్ళిపోయింది.

నేను నా పరిసరాలను కలయచూడ గానే నా గుండె ఆగిపోయినట్టయింది. ఎందుకంటే నేను చేరినది ఒక విశాలమైన, లోతైన లోయ. దాని చుట్టూతా చాలా ఎత్తయిన కొండలున్నాయి. వాటి శిఖరాలు చూడటానికి తలయెత్తితే తలగుడ్డ కింద పడిపోవలిసిందే. ఎత్తయితే అయింది, ఎక్కి పైకి పోదామంటే ఆ కొండల అంచులు నిటారుగా, చెక్కినట్టున్నాయి. అవి ఎక్కటం మనుష్యమాత్రుడు చేయ గల పని కాదు.

ఆ లోయను చూస్తుంటే నాకు విడు పొచ్చింది. ఆ పళ్ళ చెట్లూ, సెలయేళ్ళూ వదిలిపెట్టి నేనిక్కడి కెందుకు రావాలి? ఇక్కడ ఒక్క గడ్డిపరక లేదు, ఒక్క చుక్క నీరుకూడా లేదు. ఇందులో నుంచి బయటపడే మార్గంకూడా లేదు. అందుచేత ఈ భయంకర ప్రదేశంలో ఆకలి దప్పులతో అలమటించి చావక తప్పదు. నేను, ఒక ఆపదనుంచి తప్పిం చుకోబోయి, అంతకంటె పెద్ద ఆపద తెచ్చిపెట్టుకున్నాను!

(ఇంకా వుంది)





# మిత్రభేదం

దమనకుడు :

అడవిలో నొక నక్క - ఆకలి దప్పు
లడలింప తిండికై - అటు నిటు తిరిగి
కనుగొనె నొక చోట - ఘన యుద్ధభూమి
విను మట ఒక భేరి - విడిపడి యుండె.
గాలికి కొమ్మలు - కదలి తాకగనె
గోల సేయుచునుండె - గొప్పగా భేరి.
ఆ శబ్దమును విని - ఆ నక్క బెదరి
నాశమౌదు నటంచు - నక్కి కూర్చుండె.
అంతలో కలిగిన - దాలోచనమ్ము
సుంత శబ్దము విని - సొగసిపోనేల ?
సుఖ దుఃఖములలోన - సుంత యోచించి
సుఖపడు తెలివితో - సుజనుండు ధరణి.
అనుకొని ధైర్యమ్ము - నంది ఆ నక్క
చనె మెల్ల మెల్లగా - కనె భేరి రూపు
భేరి నిండుగ తిండి - కూరినా రనుచు
పేరాసతో నక్క - బిరబిర కొఱికి
దూరి కూర్చుండి వి-దో పంట కొఱుక
దోర కఱ్ఱ యటంచు - తోచిన ననియె :
మెదడు నిండుగ గల - మేత అటంచు
మది దలంచితి మున్ను - మఱి లోని కేగ
తెలిసిపోయెను కదా - దీని బండారు
వెలుపల చర్మము - తలదాక కఱ్ఱ.
కావున శబ్దమ్ము-నే విని బెదరి
పోవుట తగదయ్య - దేవరా వినుడు.

పింగళకుడు :

ఏమి సేయగవలె - ఇట నున్నవారు
నా మాత్రమైన ఉ-న్నారనుకొనను.
భయపడిపోయి ఈ - ప్రాంతమ్ము వదలి
నయమొప్ప పోవగా - నన్ను కోరెదరు.

దమనకుడు :

అది వాని దోషమా ? - అధిపతి ఎట్లు
బెదరెనో అట్టులే - బెదరె మృగాలు.
గుండె జారగనీక - కూర్చుండు డిచట
దండి శబ్దమ్మెదొ - దరిసి చూచెదను

విద్వాన్ విశ్వం



దాని మర్మ మెఱింగి - తప్పక వత్తు
నే నిప్పుడే దొర - అనతి చాలు.

పింగళకుడు :

నిజముగా పోదువా - నీవు? శబ్దమ్ము
గజిబిజి పరచదా - కాసింత అయిన?

దమనకుడు :

దొర పోయి రమ్మన్న - సరి అనకున్న
నరుడింక భృత్యుడై - మెఱయుట ఎట్లు?
చెప్పిన మాటను - చెవి బెట్టుకొనక
అప్పుడిప్పు డటన్న - అతడేల రాజ?

పింగళకుడు :

సరి పోయి రమ్ము ఆ - సరణిని గాంచి
బిరబిర వచ్చి నా - భీతిని మాన్పు.

మృగరాజు సరి అన్న - తెగబడి నక్క
మొగము శబ్దమువేపు - మూదలజేసి
దొరకు దండము పెట్టి - దూకుచు బోయె
స్థిరబుద్ధితో నిదే - తెలివనుకొంచు.
దమనకు డేగిన - తర్వాత రాజు
విమతియై ఇట్లని - వేమాఱు తలచె:
పదవి పోయిన నక్క - పాపమ్ము తలచి
ఎదిరితో లంచాల - నేమైన మెక్కి
మెదలకు నాకు నె-గ్గుదలంచు నేమొ
గదుముక వచ్చునో-గద ఆ మృగమ్ము—
నమ్మక ద్రోహమ్మె - నాయకు జంపు
మమ్మాటికిని నమ్మ-బోల దెవ్వరిని.
అనుకొని మృగరాజు - ఆవలి కేగె
తను వాని దారిని - తద్దయు గనుచు.
ఆ దమనకుడేమొ - అటులేగి కనియె
కాదట సంజీవ-కమె కాని మృగము.
అరెరె! ఎద్దే యిది - సరిపోయె ననుచు
మురిసిపోయెను నక్క-పరమ హర్షమున.
విను రొట్టె విఱిగి నే-తిని పడెనంచు
తనకు రాజును దాస-జనుని సేయంగ
ఇది ఒక మార్గమం - చెంచి యోచించె.
బెదరినయప్పుడే - కద రాజు దొరకు.
అనుకొంచు సింహమ్ము - గనుటకై తిరిగి
చనుదెంచుచుండగా-సరి ఒక్క డనుచు—
తన ముఖ కవళికల్ - దాచి సింహమ్ము
మునుపటి తావున - మొనసి కూర్చుండె.

దమనకుండును వచ్చి - దండమ్ము వెట్టి
సుమతి యట్టులు కూరు-చుండె అక్కడను.

పింగళకుడు :

చూచి వచ్చితివా పి-శాచ మృగమ్ము
ఆ చాయ నా కింక - అంతయు దెలుపు.

దమనకుడు :

చూచితి నోరాజ - చూచితి దాని
చూచి చూడక దొర - జూడంగ గలన?

పింగళకుడు :

క్షుద్రుడవని నిన్ను - చూడలేదేమొ
భద్ర మృగమ్మునిన్ - ప్రాణాల విడిచె
తన కుంభముల నెక్క-తన్ను తుమ్మెదల
కినిసి కొట్టునె? వీను - కేరింతలిడును.
బలవంతు డెప్పుడు - బలవంతు పైనె
అలుక బూనును పగ - నల్లె సాధించు.

దమనకుడు :

పోనిండు దానిదే - పుణ్య జన్మమ్ము
కానిండు మేమెల్ల - కాసింత జనమె.
ఏమైన మీ రొక్క-టే మాట అన్న
ఆ మృగమ్మును మీకు - అనుచరు జేతు.

పింగళకుడు :

అంత సామర్థ్యమే - అబ్బెనా నీకు?
అంతవానిని దెచ్చు-నంతవా నీవు?

దమనకుడు :

తెలివితో సేయంగ - వలనుగా నట్టి
విలలోన లేవని - వినలేదె మీరు.



కత్తి కటారుల - గజ తురగాల
ఎత్తివెళ్లియు చేత - నేమి కానట్టి
పనులను బుద్ధితో - ఒనగూర్చవచ్చు
నను మాట పెద్దలే - అన్నారు కాద?

పింగళకుడు :

సరి అట్టులైనచో - పర మంత్రిపదవి
సరగున నీకిత్తు - సందియ మేల?
అని సింహ మాతని - నా నిమిషమ్మె
పనిలోన నియమించె - పాత ప్రధాని.
ఇది చాలు ననుకొని - ఎగురుచు నక్క
ముదముతో తిరిగి-ఆ ముఖముగా పోయె.
సంజీవకమ్మను - చక్కని గిత్త
పుంజుకొన్నట్టి ఆ - భూమిని చేరె.



# "మనిషికన్న దుంగమేలు"

పూర్వం కాశీరాజుకు ఒక కొడుకుండే వాడు. వాడు పరమ దుర్మార్గుడు. వాణ్ణి అందరూ తాచుపామును చూసినట్టు చూసే వారు. ఒకనాడు ఈ రాజకుమారుడు తన నౌకర్లతో గంగాస్నానానికి వెళ్ళాడు. వారు గంగవద్దకు వెళ్ళేసరికి పెద్ద గాలివాన ఆరంభమయింది. ఆ గాలివానలో గంగలో దిగటానికి నౌకర్లు భయపడ్డారు. కాని రాజకుమారుడు వాళ్లతో, "నేనీ గాలివాన లోనే స్నానం చెయ్యాలి. నన్ను నది మధ్యకు తీసుకు పొండి!" అని అధికార పూర్వకంగా అన్నాడు. అసలే రాజకుమారు డంటే ఎంతో ద్వేషంతో ఉన్న ఆ నౌకర్లు అతడిని గంగమధ్యకు తీసుకుపోయి, అక్కడ అతన్ని వదిలేసి, ఈదుకుంటూ ఒడ్డుకు చేరారు. తరవాత వారు రాజసౌధానికి తిరిగిపోయి, రాజుతో, "మహాప్రభూ, అబ్బాయిగారు మాతోబాటే గంగలో దిగారు. ఆ తరవాత ఎంత వెతికినా మా కాయన కనిపించలేదు," అని చెప్పారు.

ఇక్కడ రాజకుమారుడు నదీప్రవాహంలో పడి కొట్టుకుపోసాగాడు. ఆ గాలివానలో అతను పెట్టిన కేకలు విన్నవారు లేరు. అదృష్టవశాత్తూ అతనికి నదిలో కొట్టుకుపోయే దుంగ ఒకటి చేతికి అందింది. అతను దానిమీదికి ఎక్కి పడుకున్నాడు. కొంతదూరం వెళ్లేసరికి ఒక పాము ఆ దుంగమీదికి చేరింది. మరి కొంతదూరం వెళ్ళాక ఒక ఎలుకకూడా దుంగమీదికి వచ్చి తన ప్రాణం కాపాడుకున్నది. ఇంకా కొంతదూరం వెళ్లేసరికి వానదెబ్బ తిన్న చిలుక ఒకటి, నది ఒడ్డున ఉన్న చెట్టు కొమ్మలమీదినుంచి, ఆ దుంగమీదనే పడింది.

ఈ నాలుగు ప్రాణులతోనూ ఆ దుంగ నదీ ప్రవాహం వెంబడి చాలా దూరం

వి. హరిప్రసాదరావు

కొట్టుకుపోయింది. రాజకుమారుడు రక్షించమని కేకలు పెడుతూనే వున్నాడు.

నది మలుపులో ఒక సన్యాసి చిన్న కుటీరం వేసుకుని నివసిస్తున్నాడు. ఆ సన్యాసికి రాజకుమారుడి ఆర్తనాదం వినిపించింది. అయన అంత వానలోనూ బయటికి వచ్చి, నదిలో కొట్టుకుపోతున్న దుంగనూ, దానిమీద బోర్లా పడుకుని వున్న రాజకుమారుణ్ణీ చూశాడు.

వెంటనే అయన నదిలో దూకి ఈదుకుంటూ వెళ్ళి, దుంగను ఒడ్డు చేర్చి, రాజకుమారుణ్ణి తన కుటీరంలోకి తీసుకుపోయాడు. అయన మళ్ళీ బయటికి వచ్చి దుంగమీద వున్న పామునూ, ఎలుకనూ, చిలుకనూకూడా లోపలికి తీసుకుపోయాడు. అవి నోరులేని ప్రాణులు గనకనూ, గాలివానవల్ల ఎక్కువగా దెబ్బతిని ఉండటం వల్లనూ, సన్యాసి ముందుగా వాటికి పరిచర్యలు చేసి, ఆహారం పెట్టి, ఆ తరవాత రాజకుమారుడి అవసరాలు చూశాడు.

రాజకుమారుడికి సన్యాసిమీద చాలా కోపం వచ్చింది. ఆ అల్ప ప్రాణులకు ముందు సేవ చేసి తరవాత తన విషయం చూసినందుకు అతను సన్యాసిపై మండిపడ్డాడు. కాని ఏమీ చేయలేని స్థితిలో



ఉండటంవల్ల అతను తన కోపాన్ని తనలోనే దాచుకున్నాడు.

రెండు రోజులపాటు సన్యాసి యిచ్చిన ఆతిథ్యం స్వీకరించి రాజకుమారుడూ, పామూ, ఎలుకా, చిలుకా కోలుకున్నారు. ఈలోపుగా గాలివానకూడా తగ్గిపోయింది. పాము సన్యాసివద్ద సెలవు పుచ్చుకుంటూ, "అయ్యా, నేను కిందటి జన్మలో గొప్ప ధనికుణ్ణి, అయితే అంతకంతా పిసినిగొట్టును. గంగాతీరాన ఫలాన చోట నలభై కోట్లు దాచిపెట్టి చచ్చిపోయాను. తరవాత ఈ పాముపుటక పుట్టి, ఆ సొమ్ముకు కాపలా కాస్తూ అక్కడే ఉంటున్నాను.

నిజానికి నాకా సొమ్ము ఎందుకూ పనికి రాదు. మీరు ఎప్పుడు కావలిస్తే అప్పుడు అక్కడికి వచ్చి నన్ను పిలవండి, ఆ ధనం మీకిచ్చేస్తాను," అని చెప్పింది.

అదేవిధంగా ఎలుక వెళ్లిపోతూ, "స్వామీ, గంగ ఒడ్డున ఫలాని చోట నేనుండే కలుగు వద్ద ముప్ఫయి కోట్ల ధనం పాతిపెట్టి వుంది. మీరు ఎప్పుడు వచ్చి నన్ను పిలిచినా ఆ సొమ్ము మీకు చూపిస్తాను," అన్నది.

తరవాత చిలుక వెళ్ళిపోతూ, "అయ్యా, నావద్ద ధనమైతే లేదుగాని, మీరు ఎప్పుడు కోరితే అప్పుడు ఎంత కావలిస్తే అంత ధాన్యం మీకిప్పించగలను. గంగ ఒడ్డున ఫలాన చెట్టువద్దకు వచ్చి నన్ను కేక పెట్టండి," అన్నది.

రాజకుమారుడు వెళ్లిపోతూ, "అయ్యా, నేను రాజునయాక కాశీకి దయచెయ్యండి. మీకు ఏం కావాలంటే అదల్లా సంకోచించకుండా యిస్తాను," అన్నాడు.

కొంతకాలం గడిచాక సన్యాసి ఈ నలుగురి నిజాయితీ ఎటువంటిదో చూద్దామని బయలుదేరాడు. దారిలో ఆయన చిలుకనూ, ఎలుకనూ, పామునూ కేకవేశాడు. అవి తాముండే చోటునుంచి బయటికి వచ్చి, తాము ఇస్తామని మాట ఇచ్చిన ప్రకారం ధాన్యమూ, ధనమూ ఇవ్వటానికి సిద్ధపడ్డాయి.



కాని సన్యాసి, "ఇప్పుడు వేరే పనిమీద పోతూ, మిమ్మల్ని చూసి పోదామని పిలిచాను. సొత్తు మీవద్దే ఉంచండి, కావలసినప్పుడు తీసుకుంటాను," అంటూ కదిలి కాశీకి వెళ్ళాడు.

ఈ లోపుగా కాశీరాజు మరణించటమూ, రాజకుమారుడు రాజు కావటమూ జరిగింది. కొత్తరాజు వీధివెంబడి ఊరేగుతూ అంత దూరాన సన్యాసిని చూశాడు. తనను ఏదో కోరటానికే బయలుదేరి వచ్చాడనుకుని రాజు తన భటులతో, "ఆ కనబడే దొంగ సన్యాసిని వెంటనే పెడరెక్కలు విరిచికట్టి, ప్రతి వీధి మలుపునా నిలబెట్టి కర్రలతో కొట్టి, తీసుకుపోయి శిరచ్ఛేదం చేసెయ్యండి!" అని ఉత్తరు విచ్చాడు.

అప్రకారమే రాజభటులు ఆ సన్యాసిని పట్టుకుని, పెడరెక్కలు విరిచికట్టి, ప్రతి వీధి మొగదలా నిలబెట్టి కర్రలతో కొడుతూ తీసుకుపోసాగారు. సన్యాసికి అంతా అర్థమయింది. రాజభటులు తనను కొట్టినప్పుడల్లా ఆయన, "మనిషికన్న దుంగ మేలు!" అని పెద్దగా అరవసాగాడు.

ఈ విచిత్రమైన శిక్ష చూడటానికి సన్యాసి చుట్టూ మూగిన ప్రజలూ, రాజోద్యోగులూ కూడా సన్యాసి అనే మాటలు విని ఆశ్చర్యపడ్డారు. "అయ్యా, మీరెవరు? మీరేమి



తప్పు చెయ్యటంవల్ల రాజుగారు మీకీ శిక్ష ఇచ్చారు? మనిషికన్న దుంగ మేలు, అనటంలో మీ ఉద్దేశం ఏమిటి?" అని వారు సన్యాసిని గుచ్చి అడిగారు. సన్యాసి వారితో జరిగినదంతా చెప్పి, "మీ రాజు గంగలో మునిగి చనిపోయే సమయంలో ఒక దుంగ ఆయనను కాపాడింది. ఆయన ప్రాణాన్ని రక్షించిన నాకు మీ రాజు చేసే ఉపకారం చూడండి," అన్నాడు.

వెంటనే ప్రజలు ఉద్రేకం చెంది తమ పాపిష్టి రాజును నడివీధిలోనే హతమార్చబోయారు. వాళ్ళకు రాజుపై అదివరకే కోపం వుంది. కాని సన్యాసే అడ్డపడి ఆ రాజు ప్రాణాలు మరొకసారి కాపాడాడు.

రాజు సన్యాసి కాళ్ళపై బడి, "స్వామీ, నా అపచారం క్షమించండి. ఇకనుంచీ మీరు నాకు ముఖ్యమంత్రిగా ఉండి, నేనెట్లా నడుచుకోవాలో, ఎట్లా రాజ్యం ఏలాలో చెప్పండి!" అని ప్రార్థించాడు.

సన్యాసి మంత్రిగా ఉండటానికి అంగీకరించాడు. కాని తీరా చూస్తే రాజ్యం యావత్తు అస్తవ్యస్తంగా ఉన్నది. ఖజానాలో డబ్బు లేదు. ప్రజలకు కావలిసిన ధాన్యంకూడా లేదు. రాజుయొక్క బుద్ధిహీనతవల్ల దేశం ఘోరమైన ప్రమాదానికి గురికావటానికి సిద్ధంగా ఉన్నదని సన్యాసి తెలుసుకున్నాడు. వెంటనే ఆయన గంగా తీరాన ఉండే పామునూ, ఎలుకనూ, చిలుకనూ రప్పించి, అవి తనకు వాగ్దానం చేసిన సొమ్మూ, ధాన్యమూ తెప్పించి రాజ్యానికి క్షేమం కలిగించి, ఆ పామూ, ఎలుకా, చిలుకాకూడా శాశ్వతంగా కాశీనగరంలో ఉండిపోయేటట్టు నివాసాలూ, భోజన సదుపాయాలూ ఏర్పాటు చేయించాడు.

అదిమొదలు కాశీరాజు తన అహంకారాన్ని కట్టిపెట్టి, అన్ని రాచకార్యాల్లోనూ, సన్యాసి చెప్పినట్టు నడుచుకుంటూ, చాలా కాలం సుఖంగా రాజ్యంచేశాడు.



# రాళ్లలో రూపాలు

**50** కోట్ల ఏళ్ళక్రితం ఉండిన ట్రైలోబైట్ అనే జంతువుగురించి మనకు ఎలా తెలుసు? భూమిమీద మానవుడు అవతరించక పూర్వం ఎన్నో రకాల జంతు జాతులూ, వృక్షజాతులూ పుట్టి రూపుమాసిపోయాయి. వీటినిగురించి తెలుసుకునేటందుకు మనకు ఏదైనా ఆధారం ఉండాలిగద. నువు పుట్టక మునుపే మీ ముత్తాత తాత పోయాడనుకుందాం. ఆయన ఫొటో గనక ఉన్నట్టయితే అది చూసి నువు, "ఆయన ఇలా వుండేవాడు!" అని తెలుసుకో గలుగుతావు.

ఇకనేం? అదేవిధంగా మనంకూడా పురాతన జంతువులనుగురించి తెలుసుకోగలుగు తున్నాం. అవును, రాళ్ళలో మనకు ఆ కాలపు జంతువుల "ఫొటో"లు దొరుకుతున్నాయి! అయితే వాటిని "ఫొటోలు" అనం, "ఫాసిల్స్" అంటాం.

ఏనాడో చచ్చిన జంతువుల రూపాలు రాళ్ళలోకి ఎందుకు రావాలని ఒక ప్రశ్న వస్తుంది. మనం చూసే రాళ్ళన్నీ భూమి పుట్టినప్పటినుంచీ ఉన్న రాళ్లు కావు. భూమిపైన ఎప్పటికప్పుడు కొత్త రాళ్ళు పుడుతున్నాయి. వానలు కురిసి కొండలు కరిగి, నదులవెంట కొట్టుకుపోయి సముద్రంలో పేరుతున్నవి. ఇలా పేరిన ఇసకా, మట్టి మొదలైనవి పై ఒత్తిడికీ, భూగర్భంనుంచి వచ్చే వేడికీ శిలలుగా మారుతున్నాయి. మొట్టమొదట భూమిమీద ఏర్పడిన గంధ్ర శిలలో "ఫాసిల్స్" దొరకవు, కాని "పేరుడు" శిలలలో దొరుకుతాయి.

పురాతన జంతువుల రూపాలను ఫాసిల్స్ ద్వారా తెలుసుకున్నట్టే, ఆ శిలల వయస్సును బట్టి ఆయా జంతువులు ఎంతకాలం క్రితం భూమిపై నివసించినదీ అంచనా వెయ్యవచ్చు. ఇటువంటి అంచనాలనుబట్టే "ట్రైలోబైట్" 50 కోట్ల ఏళ్ళక్రితం జీవించిందనీ, దయ్యపు బల్లులు మూడున్నర కోట్ల ఏళ్ళక్రితం జీవించాయనీ తెలుసుకోగలుగుతున్నాం.





ఫాసిల్ రూపాలు: ట్రైలోబైట్, దయ్యపుబల్లుల అడుగుజాడలు.

# కీటక జాతులు

ఈనాటి ప్రపంచంలో అరు లక్షల కీటక జాతులున్నాయి; ఒక్కొక్క జాతిలోనూ అసంఖ్యాక మైన కీటకాలున్నాయి. కీటకాలకూ ఇతర జంతు జాతులకు గల ముఖ్యమైన తేడాలేమంటే: కీటకాల శరీరాలు మూడు భాగాలుగా విభజన పొంది ఉంటాయి; వాటికి ఆరేసి కాళ్ళుంటాయి. రెండేసి మీసాలుంటాయి.

చీమలూ, ఈగలూ, దోమలూ, చిమ్మటలూ, సీతాకోకచిలుకలూ, మిణుగురు పురుగులూ, ఇలకోళ్ళూ, కీచురాళ్ళూ, మిడతలూ, గొల్లభామలూ, తూనీగలూ, తుమ్మెదలూ, కందిరీగలూ, బొద్దింకలూ, చెదలూ, పేలూ, పురుగులూ, నల్లులూ మొదలైనవి కీటకాలు.

ప్రపంచంలో సామాన్యంగా కీటకాలు బతకలేని ప్రాంతమంటూ లేదు. కొన్ని రకాల కీటకాలు మనకు లాభం చేకూర్చిపెడుతున్నాయి. పట్టుపురుగులనుంచి మనకు పట్టు లభిస్తున్నది; దానితో మనం అనేకరకాల బట్టలు, నేస్తున్నాం. తేనెటీగలు మనకుపూల నుంచి మకరందం తెచ్చి తేనె తయారుచేసి పెడుతున్నాయి. అందుచేతనే మనం పట్టు పురుగులనూ, తేనెటీగలనూ ఒక పరిశ్రమగా పోషిస్తున్నాం.

కీటకాలలో రెక్కలు లేనివీ, రెండేసి రెక్కలున్నవీ, నాలుగేసి రెక్కలున్నవీ కూడా ఉన్నాయి. ఇవి రకరకాల ఆహారాలు తింటాయి. మట్టితో గూళ్ళు కట్టే కందిరీగలు చిన్న తనంలో మాంసాహారులుగా ఉండి, పెద్దయాక శాకాహారులుగా మారతాయి! అవి తమ పిల్లల కోసం సాలీళ్ళను తెచ్చిపెట్టి, తామమాత్రం పూలలో మకరందం తాగుతాయి! సాలీళ్ళుకూడా కీటకాలే. ఒకరకం కీటకం మరొక రకం కీటకాన్ని తినటమే గాక, కొన్ని కీటకాలు తమ జాతివాటినే తింటాయి. ఆడ గొల్లభామ మగ గొల్లభామను తినటం పరిపాటే!



తుమ్మెద – మిడత – మిణుగురుపురుగు – కందిరీగ

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 నవంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబరు 5-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## సెప్టెంబరు నెల ఫోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కొమ్మెక్కి కులికేవు

రెండవ ఫోటో : కింద బడి దొర్లేవు

పంపినవారు : ఎస్. శ్రీరాములు S/O వి. బి. ఎతిరాజులు నాయుడు, ఆనంద బిస్కెట్ షాపు, మదనపల్లి - (చిత్తూరుజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




ప్రొఫెసర్ పి. సి. సర్కార్

"పేక ముక్కల రాణి" అన్న ట్రిక్కు నేను స్వంతాన కనిపెట్టినది. దాన్ని ఇప్పటికీ ప్రదర్శిస్తూనే వున్నాను.

ఇంద్రజాలికుడు ఒక చీట్ల పేక తీసి బాగా కలుపుతాడు. తరవాత ప్రేక్షకులలో అయిదు మూలల ఉన్న అయిదుగురిని తలా ఒక ముక్కా తీసుకోమంటాడు. వాళ్ళు ముక్కలు చూసి తిరిగి ఇచ్చినాక పేకను తిరిగి కలుపుతాడు. తరవాత అతను "పేక ముక్కల రాణి"ని స్టేజి పైకి రమ్మంటాడు. ఆమె ప్రవేశం ఆశ్చర్యకరంగా ఉండేలాగు చెయ్యవచ్చు. ఆమె ఎంతో ఆకర్షవంతమైన దుస్తులు ధరించి, తలపైన ధగధగా మెరిసే కిరీటం ధరించి ఉంటుంది. ఆమెపై "స్పాట్ లైట్" వెలుగుతూంటుంది. ఇంద్రజాలికుడు తన చేతిలోని చీట్ల పేకను ఒక పళ్ళెంలో పెట్టి ఆమె చేతికి ఇస్తాడు. ఆమె ఆ పళ్లాన్ని పట్టుకుని కదలక నిలబడి ఉంటుంది.

అప్పుడు ఇంద్రజాలికుడు ఆమె కిరీటంకేసి వేలు చూపుతూ, "ఒకటి-రెండు-మూడు" అంటాడు. వెంటనే తుపాకీ పేలిన చప్పుడవుతుంది. ఆ క్షణంలోనే "రాణి" కిరీటం పైన అయిదు పేకముక్కలు, బొమ్మలో చూపిన విధంగా, నిలబడి ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేస్తాయి. వీటిలో ఒకటి బొమ్మా, దాని పక్కన ఆఠీను ఏడు, ఇస్పేటాసు, డైమను ఎనిమిది, కళావరు ఐదు ఉన్నట్టు చిత్రకారుడు చాలా చక్కగా చిత్రించి చూపెట్టాడు.

కింది బొమ్మలో కిరీటం వెనుకవైపు చూపబడింది. ఇందులో ఐదు పేక ముక్కలూ, వెనుకకు మడిచిపెట్టి

సూదులతో పట్టి ఉంచటం చూడ వచ్చు. ఈ సూదులు రెండేసి కొక్కాలలోనుంచి దూర్చి ఉంటాయి. సూదులన్నిటికీ కలిపి ఒక దారం ఉంటుంది. ఈ దారాన్ని లాగినట్టయితే సూదులన్నీ జరుగుతాయి; పేక ముక్కలు లేచి నిలబడతాయి.(బొమ్మ చూడండి) "రాణే" ఈ దారాన్ని లాగుతుంది.

ఈ ట్రిక్కులో ఉండే చిత్రమేమంటే కిరీటాన్ని ముందుగానే తయారు చేసి ఉంచుకోవచ్చు. సమయానికి దాన్ని నెత్తిమీద ఉంచుకోవటమూ, దారం చేతిలోకి తీసుకోవటమూ మాత్రమే తరవాయి.

ఒక్క విషయం గమనించాలి. అయిదుగురు ప్రేక్షకులకు అయిదు పేకముక్కలు మనకు కావలిసినట్టు అందించటం సాధ్యంకాదు. నేను వాడే పేకలో 52 ముక్కలూ ఒకే విధమైనవి ఉంటాయి—మాటవరసకి ఇస్పేటాసులనుకోండి. నేను అయిదు మూలల ఉన్న అయిదుగురు ప్రేక్షకులకూ ఇస్పేటాసే ఇస్తాను. తరవాత తుపాకీ మోగినప్పుడు కిరీటంమీద కనిపించే అయిదు ముక్కలూ అయిదు





గురివని చెబితే -వారు నమ్ముతారు. కాని అందరూ ఒక ముక్కను మాత్రమే గుర్తించుతారు. మిగిలిన నాలుగుముక్కలూ ఇతరులవని ఎవరి మటుకు వారనుకుంటారు. ఇందులో మోసం వారు తెలుసుకోలేరు. ప్రదర్శనం చాలా జయప్రదమవుతుంది.

---

[పాఠకులు, యీ గారడీని గురించి మరేమైనా సలహాలు పొందదలిస్తే: ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888 కలకత్తా-12.]

## అట్టచివరి బొమ్మ

ఒకరోజు రాజు - 9

మస్రూర్ బయలుదేరాడు. అతన్ని అంతదూరంలోనే చూసి అబూ తన భార్యతో, "ఖలీఫాకూ రాణీకీ ఎవరు చచ్చారని జగడం వస్తుందనుకుంటూనే వున్నాను. ఖలీఫా పంపగా మస్రూర్ వస్తున్నాడు. ఇదే మనకు నిజమైన పరీక్ష! నువు వెంటనే చచ్చిపోయినట్టు పడుకో!" అన్నాడు.

మస్రూర్ వచ్చేసరికి దుప్పటి చుట్టి గన్నా నేలమీద పడుకుని వున్నది.




అబూ ఆమె పక్కన కూచుని కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నాడు. మస్రూర్ అతన్ని లాంఛనగా ఓదార్చి, తిరిగివెళ్ళి, చచ్చిపోయింది గన్నాయేనని ఖలీఫాకు చెప్పాడు.

ఈ మాట విని జుబేదా మండిపడి, మస్రూర్ మీద తన చెప్పులు విసిరి, ఎవరు పోయారో చూసిరమ్మని తన ముసలిదాదిని పంపింది. దాదిని అంత దూరాన చూస్తూనే అబూ ఈసారి తాను శవం పాత్ర ధరించాడు. ఆమె వెళ్ళేసరికి అబూ నేలమీద పడుకుని వున్నాడు. అతని పక్క గన్నా నెత్తి బాదుకుని ఏడుస్తూ కనిపించింది. ముసలిది లాంఛనగా గన్నాను ఓదార్చి, తానుకూడా కాస్త కంట తడిపెట్టుకుని, రాజభవనానికి తిరిగివెళ్ళి, చచ్చిపోయింది అబూయేనని చెప్పింది.

ఇద్దరిని పంపితే ఇద్దరూ చెరొక వార్త చెప్పారు. నిజం తెలియనే లేదు.

"ఇది ఇట్లా తేలదు. ఇందులో ఏదో మోసం వుంది. మనమంతా బయలుదేరి వెళ్ళి నిజం తెలుసుకుందాం!" అన్నాడు ఖలీఫా.

ఖలీఫా, జుబేదా, దాసీలూ, పరివారమూ, అంతా కలిసి అబూ అల్ హసన్ ఇంటికి బయలుదేరారు. ఇది కనిపెట్టి అబూ, "పెళ్ళామా, మన ఆట కట్టయింది! మనం ఇద్దరం చావ

వలిసిన తరుణం వచ్చింది! చద్దాం పట్టు!" అన్నాడు.

ఇద్దరూ దుప్పట్లు చుట్టుకుని, కాళ్లు మక్కావేపు చాచి, చచ్చినట్టు పడు కున్నారు. ఇంతలో ఖలీఫా మొదలైన వారు రానేవచ్చారు.

"అయ్యో, గన్నా! భర్త చచ్చి నందుకు గుండె పగిలి నువూ చచ్చా వుటే?" అని విలపించింది జుబేదా. ఆమె దుఃఖంలోకూడా తన అపజయం అంగీకరించ దలచలేదు.

"అదే నేను ఒప్పుకోను. గన్నా కోసం గుండె పగిలి అబూ చచ్చాడు," అన్నాడు ఖలీఫా. ఆయనకూడా తన అపజయం అంగీకరించ దలచలేదు.

"లేదు, అబూ ముందు చచ్చాడు," అన్నది జుబేదా.

"కాదు, గన్నా ముందు చచ్చింది!" అన్నాడు ఖలీఫా.

ఇద్దరూ మళ్ళీ పోట్లాడుకున్నారు.

"ఈ ఇంటో నౌకర్లేరీ? వాళ్ళనడి గితే నిజం తెలిసిపోతుందే!" అన్నది జుబేదా.

"అవును. ఎవరు ముందు చచ్చారో చెప్పినవాళ్లకి పదివేల బంగారు దీనారా లిద్దును!" అన్నాడు ఖలీఫా.

"నాకా పదివేల దీనారాలూ ఇప్పిం చండి, మహాప్రభూ! గుండె పగిలి రెండోసారి చచ్చింది నేనే, అబూ అల్ హసన్‌ను!" అని దుప్పటిలోనుంచి అబూ కేకపెట్టాడు.

ఖలీఫాకు మోసమంతా అర్థమైంది. ఆయన విరగబడి నవ్వసాగాడు.

అబూ, గన్నా లేచి కూచుని, డబ్బు కోసం తాము పడిన పాట్లన్నీ విన్న వించుకుని, క్షమాపణ వేడారు. ఖలీఫా, జుబేదా వారిని క్షమించారు. అబూ అవసరాలను గమనించక పోవటం తన తప్పేనని ఖలీఫా అర్థం చేసుకున్నాడు. పెద్ద వజీర్‌తోబాటు అబూ అల్ హసన్‌కుకూడా జీతం ఏర్పాటుచేసి, అతన్ని కలకాలం తన అనుచరుడుగా వుంచుకున్నాడు.

—(ఐపోయింది)





# వార్తలు-విశేషాలు

పూర్తిగా ఎయిర్‌కండిషన్ చేయబడిన మూడురైళ్లు, అక్టోబర్ 1వ తేదీ నుండి, ఢిల్లీ-హౌరా, ఢిల్లీ-బొంబాయి, ఢిల్లీ-మద్రాసు మార్గాలలో నడుపబడగలవు. రైలు అంతా ఎయిర్ కండిషన్ చేయబడ్డం యిదే మొదటిసారి.

*　　　*　　　*　　　*

విశాఖపట్టణంలో, కొత్తగా పోలీటెక్నిక్ స్కూలును ప్రారంభించేందుకు, సన్నాహాలు చేయడానికి, ఆంధ్రప్రభుత్వం ఒక స్పెషల్ ఆఫీసరును నియమించింది. ఈ టెక్నికల్ స్కూలు, యీ సంవత్సరంలోనే ప్రారంభింప బడగలదు. ఇందులో 100 మంది విద్యార్థులకు అవకాశం వుంటుంది.

*　　　*　　　*　　　*

ద్వితీయ పంచవర్షప్రణాళిక కింద, ఆంధ్రరాష్ట్రంలో అభివృద్ధి పథకాలను అమలుపరచడానికి 19 కోట్ల రూపాయలు ఖర్చుచెయ్య బడగలవని భావించబడు తున్నది. ప్రథమ పంచవర్షప్రణాళిక చివరి సంవత్సరంలో, ఆంధ్రలో 17 కోట్ల రూపాయల సొమ్ము అభివృద్ధి కార్యక్రమాలపై ఖర్చు చెయ్యబడింది.

*　　　*　　　*　　　*

1957 ఏప్రిల్ నెలనుంచి, మనదేశంలో అమలులోకి రాబోయే దశాంశపద్ధతి నాణాలను, దక్షిణరైల్వేలోని, విజయవాడ, గుంటూరు, తెనాలి, రాజమంద్రి, నెల్లూరు స్టేషన్‌లలో ప్రదర్శించటానికి ఉత్తరువు లివ్వబడినవి.



మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోగల, తెలుగు లిఖితగ్రంథాలను సంపాదించి, వాటిని తిరుపతిలోని ప్రాచ్య విద్యాపరిశోధన సంస్థకుపంపి, జాగ్రత్తపరచటానికి ఆంధ్రప్రభుత్వం తగు చర్యలు తీసుకుంటున్నది.

* * * *

తుంగభద్ర ప్రాజెక్టుకింద, అడవిభూములను సాగుకు వీలుగా చేయటానికీ, పంటకాల్వల త్రవ్వకానికిగాను, దాదాపు 15 లక్షల రూపాయల విలువచేసే భారీయంత్రాలను ఇండియా ప్రభుత్వం కొన్నది. ఈ యంత్రాలతో నవంబరు నెలనుంచి పని ప్రారంభించ బడగలదు.

* * * *

ఇండియాలో పశుసంపద గత అయిదు సంవత్సరాలుగా, నూటికి అయిదువంతుల చొప్పున పెరుగుతున్నదని, ఇటీవల సేకరించబడిన లెక్కలద్వారా తెలియవచ్చింది. 1951 వ. సంవత్సరంలో, మొత్తం 2,920 లక్షల పశువులు వుండగా, 1955 లో 3,070 లక్షల పశువులవరకు వున్నవి.

* * * *

భారత నౌకాదళానికి, విమానవాహకనౌక నొక దానిని, కొనాలని ప్రభుత్వం సంకల్పించి నట్లు, రక్షణమంత్రి శ్రీ డాక్టర్ కట్జూ లోకసభలో వెల్లడించారు.

* * * *

యంత్ర సహాయంతో, వ్యవసాయాభి వృద్ధిని సాధించేనిమిత్తం, అందుకు అవసరమైన శిక్షణపొందిన సిబ్బందిని సమకూర్చటానికి భోపాల్‌లో ఒక కేంద్రం ప్రారంభించ బడింది. ఈ కేంద్రంలో ప్రతి సంవత్సరం 100 మందికి శిక్షణ గరపబడుతుంది. దీని అధ్వర్యం; కేంద్ర ఆహార వ్యవసాయ మంత్రిత్వశాఖ వారిది.

* * * *

నేపాల్‌దేశ రాజధాని ఖట్మండూలో, నవంబరు నెలలో అంతర్జాతీయ లిపి ప్రదర్శనాన్ని, నేపాల్ ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నది. అందులో పాల్గొనేందుకు, ఇండియా ప్రభుత్వం అంగీకరించింది.



# చిత్రకథ





ఒక రోజున దాసు, తనదగ్గిర ఉన్న చిన్న కేమెరాతో, వాసుకు ఫొటో తీస్తానన్నాడు. ఇద్దరూ కలిసి, దగ్గిరలో ఉన్న తోటలోకి వెళ్ళారు. 'టైగర్' వాళ్ళ వెంట వెళ్ళింది. దాసు, వాసును ఒక చెట్టు పక్కన కూర్చోపెట్టి, 'ఒకటి... రెండు...మూడు' అని ఫోటో తీసేంతలో, 'టైగర్' వాసు ముందుగా దూకింది. అదేమీ గమనించని దాసు, తరవాత ఆ ఫిలుమును ఆ ఊళ్ళో ఉన్న ఫొటోగ్రాఫరు దగ్గిరకు తీసుకుపోయి, ప్రింటుచేసి పెట్టమన్నాడు. ఫొటోగ్రాఫరు ప్రింటు తయారుచేసి ఇచ్చాడు. అది చూసుకుని, దాసూ వాసూలు నివ్వెరపోయారు.





Printed by B. NAGI REDDI at the B.N.K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'

నిర్మలకు పాఠము...













# సన్‌లైట్ సబ్బు

భారతదేశంలో తయారుచేయబడినది

బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును

S. 228-50 TL

Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

కింద బడి దొర్లేవు

పంపినవారు :
ఎస్. శ్రీరాములు - మదనపల్లి

